ప్రవేశ పెడుతున్నారు

# రీఫిల్ ప్యాక్‌లో సెరిలాక్ వీట్




# ఆదా చేయండి రు.1.50 ప్రతి ప్యాక్ పైన

ఇప్పుడు సెరిలాక్ వీట్ రీఫిల్ ప్యాక్‌లలో లభిస్తోంది. మీ పాపాయికి సెరిలాక్ లాభాలన్నింటినీ అందించండి. ప్రతి ప్యాక్ పైన రు. 1.50 ఆదాచేయండి.

4 నెలల నుంచి మీ పాపాయికి పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. దీనిని సెరిలాక్ లాభంతో ప్రారంభించండి!

ప్రతిసారి తినిపించే సెరిలాక్ మోతాదులో పోషక పదార్థాలన్నీ ఉన్నాయి. పాపాయిలకు సెరిలాక్ రుచి లలో ఇష్టం. దానిలో పాలు పంచదార ఉన్నాయి. దానిని ముందుగా కాచిన నీటిలో కలిపితే చాలు. ఇప్పుడు సెరిలాక్ లాభాలు అన్నీ కూడా తక్కువ ధరకే లభిస్తున్నాయి.

తయారు చేయడంలో పరిశుభ్రతను పాటించేందుకు, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు, ప్యాక్‌పైన ఉన్న సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచితం !
సెరిలాక్ బేబీ కేర్ బుక్
ఈ చిరునామాకు వ్రాయండి:
సెరిలాక్, పోస్ట్‌బాక్స్ నం. 3
న్యూ ఢిల్లీ 110 008

## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం

R K SWAMY/FSL/5072 TEL

# కొత్త హార్లిక్స్ బిస్కెట్స్.
# కొంతమంది మంచి రుచి నిపుణులు యిలా అంటున్నారు...













కొత్త

## హార్లిక్స్ బిస్కెట్స్

ఇప్పుడు

రుచికరమైనవి, పాలతో నిండినవి, మరియు సంపూర్ణమైన హార్లిక్స్ మంచితనవి.

HTA 5456 TEL

దాగుడు మూతలు ఆడేవాళ్ళు
ఈ రణబాని ఓడించాలని చూసేవాళ్ళు
వాళ్ళందరితో నాకేం పనింక
చేస్తాగా నే కొత్తవింత ఏదో ఇంక.
నాఎకో పెన్నుల సెట్టు
కాలక్షేపాన్నదే తెచ్చి పెట్టు
ఇలావేస్తా నేగోడమీద బొమ్మ గొలుసుల బొమ్మ
అలా గీసేస్తా నే రెండుజడల అమ్మాయి బొమ్మ
ఎకో పచ్చ ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగులమయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓసెట్



ఉచితం!
కలరింగ్ ఫోల్డర్




# ఎకో
స్కెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!

సిషన్ రైటింగ్ పాయింట్స్(ప్రైవేట్)లిమిటెడ్, 18, సుభాష్ రోడ్, విలె పార్లే (ఈస్ట్), బొంబాయి 400 057.

Trikaya-E-1-86-TEL




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["సువర్ణయోగం"] కు ఆధారం, వీరేపల్లి జయరాంరెడ్డి రచన. ధనంపట్ల అత్యాశగలవాడు, మంచి చెడ్డల తారతమ్యాన్ని గుర్తించడు. ఆ కారణంగా, అమాయకులు బాధలకు గురి అవుతారు. అయితే, ఒక్కొక్కసారి వాళ్ళ ద్వేషం ఏ రూపంలో బయటపడుతుందో, "అమాయకుడిద్వేషం" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

ఘాతయితుమేవ నీచః పరకార్యం, వేత్తి న ప్రసాధయితుమ్,
పాతయితుమస్తి శక్తిర్వాయోవృక్షం, న చోన్నమితుమ్.

[పెనుగాలి చెట్లను కూల్చగలదే తప్ప, అవి పెరగడానికి సహాయపడదు. అదేవిధంగా, నీచులు ఎదుటివారికి హాని చేయగలరే గాని, మేలు చేయలేరు!]

సంపుటి 82 జూన్ '88 సంచిక 6

విడి ప్రతి : 2-50 :: సంవత్సర చందా : 30-00

# ఉచితం!

## మేగి ఫన్ బుక్!



కేవలం 2 ఖాళీ మేగి నూడుల్స్ ప్యాకెట్లకు బదులు.

మీకు అతి దగ్గరలోని డీలర్‌ని కలుసుకోండి. లేదా ఈ కూపన్‌ని యీ చిరునామాకు పంపండి

మేగి ఫన్ బుక్
పోస్ట్ బ్యాగ్ నం. 9
న్యూ ఢిల్లీ-110001



Look out for the
'FUN WORLD'
CONTEST
inside!

MAGGI®
FUNBOOK






కాలక్షేపం, ఆటలు, మేగి క్లబ్, పజుల్స్...
ఇంకా ఎన్నో!




నా పేరు: ____________

నా పూర్తి చిరునామా: ____________




తేలిగ్గా వండవచ్చు! రుచిగా తినవచ్చు!

HTA 5490 TEL

# పనిసులువు

ఒక జమీందారు, తన దివాణం సింహద్వారానికి ముందు అటూ, యిటూ రెండు ఏనుగు శిల్పాలు చెక్కించి పెట్టాలనుకుని, నాగప్ప అనే శిల్పిని పిలిపించాడు.

నాగప్ప, తన శిష్యుడైన జోగప్పను వెంటబెట్టుకుని వచ్చాడు. అతను జమీందారు చెప్పింది విని, శిల్పాలు పూర్తవడానికి కనీసం నెల రోజులు పడుతుందన్నాడు.

అది విని జమీందారు పక్కన వున్న దివాను, "ఈ పనివాళ్ళున్నారే, వీళ్ళ పని దొరికితే చాలు, దాన్ని అలా సాగదీస్తూ కాలం గడిపేస్తారు," అన్నాడు.

నాగప్ప ఏమీ అనలేక తల వంచుకున్నాడు. అప్పుడు శిష్యుడు జోగప్ప కల్పించుకుని, "అయ్యా, మా గురువుగారికి పనిసులువు గురించి అంతగా తెలియదు. ఏనుగు శిల్పాలు చెక్కడం ఎంతసేపు! ముందుగా ఏనుగంత ఎత్తున్న రెండు బండరాళ్ళను తెప్పించండి," అన్నాడు.

"అలాగే తెప్పిస్తాం. ఎంత తొందరలో పని పూర్తి చెయ్యగలరేమిటి?" అని అడిగాడు దివాను.

"పని పూర్తి చెయ్యడం ఎంతసేపా! ఆ బండరాళ్ళల్లో, ఏనుగులా కనిపించనిదంతా చెక్కి పారేస్తే పని పూర్తయినట్టేగదా," అన్నాడు జోగప్ప.

జోగప్ప మాటల్లోని వ్యంగ్యం అర్థం చేసుకున్న జమీందారు చిరునవ్వునవ్వి, "మీరు నాకు చూపవలసింది, మీ పనితనం గాని, పనిలో మీకు తెలిసిన సులువుబలువులు కాదు. ఎంత కాలం పట్టినా, ఖర్చు ఎంత అయినా ఫర్వాలేదు. శిల్పాలు మాత్రం అందంగా వుండేలా చూడండి," అన్నాడు.

దివాను తన అనవసర జోక్యానికి సిగ్గుపడి తల వంచుకున్నాడు.

—జొన్నలగడ్డ రత్న





# అమాయకుడి ద్వేషం

సూరన్న అనే యువకుడు చాలా అమాయకుడు. తండ్రి చనిపోయేటప్పుడు వాడితో, ''ఒరే, అబ్బాయీ! కష్టపడి పని చేసి డబ్బు సంపాదించు. ఎవరినీ యాచించకు. అన్నింటికీ ఆ భగవంతుణ్ణి నమ్ము. ఆయన దయవల్ల, నీ శ్రమకు తగ్గ ప్రతిఫలం లభిస్తుంది. నీ కన్యాయం చేసిన వారికి, నీ శాపం తగుల్తుంది,'' అని చెప్పాడు.

సూరన్న అంతా బుద్ధిగా విన్నాడు.

తండ్రి చనిపోయాక సూరన్న ఆయన చెప్పినట్లే చేయసాగాడు. ఎవర్నీ దేనికీ నొప్పించకుండా, అందరికీ పనిచేసి పెట్టడంవల్ల, వాడికి చాలా మంచివాడన్న పేరొచ్చింది. కానీ ఒక్కరు కూడా వాడికి శ్రమకు తగ్గ ప్రతిఫలం యిచ్చేవారు కాదు. ఏదోతిండికిలోటులేకుండాజరిగిపోతున్నది తప్ప, వాడిదగ్గిర డబ్బు చేరడం లేదు.

ఇలా వుండగా ఒకరోజున వాడికి జబ్బు చేసింది. వైద్యుడి దగ్గిరకు వెళితే, ఆయన ముందుగా డబ్బు తీసుకురమ్మన్నాడు.

సూరన్న దీనంగా, ''అయ్యా, నా దగ్గిర డబ్బులేదు. మీ దగ్గిర పనిచేసి బాకీ తీర్చుకుంటాను,'' అని చెప్పాడు.

వైద్యుడు డబ్బుతెస్తేగాని మందివ్వనన్నాడు. సూరన్న దిగులుగా ఇంటికి వెళ్ళిపోయాడు.

జరిగినదంతా వైద్యుడి కూతురు పద్మిని చూసింది. ఆమె సూరన్న వెనకనేవెళ్ళి, ''మా నాన్న గతంలో ఎన్నోసార్లు నీ చేత పని చేయించుకుని సరిగ్గా డబ్బివ్వలేదు. ఆ విషయం, ఆయన ముందే అనవలసింది,'' అని చెప్పింది.

సూరన్న ఆమెకు, తన తండ్రి చేసిన హితబోధ చెప్పాడు. అంతా విని పద్మిని, ''నువ్వు చాలా అమాయకుడివి. ఇలా



వుంటే నీకు రోజులు గడవవు. అందర్నీ ఎదిరించి బతకడం నేర్చుకో," అని సలహా యిచ్చింది.

సూరన్న ఆమె మాటలు లక్ష్యపెట్టకుండా, "ఈ రోజు నువ్వు చెప్పావని మీ నాన్న నెదిరిస్తాను. కానీ రోజూ నాకెవరు చెబుతారు? ఎవరో చెబితే తప్ప ఎదిరించడం గురించి నాకు తెలియదు. తెలియని పని చేయడం ప్రమాదం," అన్నాడు.

"నువ్వు నాకు నచ్చావు. నన్ను పెళ్ళి చేసుకో. నేను నీకు మంచి సలహాలిస్తాను," అన్నది పద్మిని.

"పెళ్ళికి మీ నాన్న ఒప్పుకుంటాడా?" అని అడిగాడు సూరన్న.

"ఎందుకొప్పుకోడు? ముందు నీ ఆరోగ్యం బాగుపడాలి. నేనిచ్చే యీ రెండు గాజులూ తీసుకో. వీటిని మా నాన్నకిచ్చి, నీ తల్లివని అబద్ధం చెప్పు. ఆయన నీకు వైద్యం చేస్తాడు. ఆరోగ్యం బాగుపడ్డాక పెళ్ళి గురించి అడుగు. తప్పక ఒప్పుకుంటాడు," అంటూ పద్మిని వాడికి తన చేతికున్న రెండు బంగారు గాజులూ తీసి యిచ్చేసింది.

"మరి నీకు నేనంటే నిజంగా యిష్టమేనా?" అని అడిగాడు సూరన్న అనుమానంగా.

"ఇష్టంలేకపోతే నా బంగారు గాజులు నీకెందుకిస్తాను?" అన్నది పద్మిని.

సూరన్న ఆ గాజులు తీసుకుని వైద్యుడింటికి వెళ్ళి, పద్మిని చెప్పినట్లే చేశాడు. గాజులు చూడగానే వైద్యుడి ముఖం మెరిసిపోయింది. ఆయన గాజుల్ని దాచమని కూతురికే యిచ్చాడు. పద్మిని వాటిని దాచానని చెప్పి, తండ్రి చూడకుండా చేతులకు వేసుకున్నది. వైద్యుడు సూరన్నను జబ్బు తగ్గేదాకా, తనింట్లోనే వుంచుకున్నాడు. పద్మిని వాడికి వేళకు మందు, ఆహారం పెట్టింది. వారంరోజుల్లోనే సూరన్న మామూలు మనిషయ్యాడు.

"నీవిక ఇంటికి వెళ్ళిపోవచ్చు," అన్నాడు వైద్యుడు సూరన్నతో.



సూరన్న వెంటనే తను వైద్యుడి కూతుర్ని పెళ్ళిచేసుకుంటానన్నాడు.

వైద్యుడు తెల్లబోయి, ''అసలు పెళ్ళి చేసుకుంటే, పెళ్ళాన్ని పోషించడం చేత నౌనా నీకు ?'' అని అడిగాడు.

''పద్మిని తెలివైనది. ఆ తెలివి నాకు తోడైతే, ఏమైనా సాధించగలను.'' అన్నాడు సూరన్న.

''నా కూతురు తెలివైనదని, నాకూ తెలుసు. అంత తెలివైనపిల్ల నువ్వంటే యిష్టపడదని, నీకూ తెలియాలి," అన్నాడు వైద్యుడు.

''పద్మినికి నేనంటే యిష్టం. లేకపోతే నా వైద్యానికి తన చేతిగాజులు తీసి ఎందు కిస్తుంది ?'' అన్నాడు సూరన్న అమాయకంగా.

సూరన్న యిచ్చిన గాజులు తన కూతురివే అని తెలియగానే, వైద్యుడు ఉలిక్కిపడి గుండెలు బాదుకుని లబో దిబో మన్నాడు.

ఆయన కూతుర్ని పిలిచి సంజాయిషీ అడిగితె, ''సూరన్న మనింట్లో బోలెడు పని చేశాడు. నువ్వాపనికి తగ్గ ప్రతిఫలమివ్వ లేదు. అందుకని నేనిచ్చాను,'' అని చెప్పింది పద్మిని.

వైద్యుడు కూతుర్నేమీ అనలేక, సూరన్నతో, ''ఒరేయ్, నువ్వు నన్ను మోసం చేశావు. ముందన్న ప్రకారం నాకు పనిచేసి బాకీ తీర్చుకో,'' అన్నాడు.

సూరన్న వైద్యుడు చెప్పిన పని చేయడానికి అంగీకరించాడు. అప్పుడాయన వాడితో, ''మా దొడ్లో పెద్ద గొయ్యి వున్నది. నువ్వు నీ ఇంటి పెరట్లో గొయ్యి తవ్వి మట్టి తీసి, నా దొడ్లో గోతిని పూడ్చాలి. ఇందుకు నువ్వింకెవరి సాయమూ తీసుకోకుండా, ఒక్కడివే పనిచేయాలి. తెలిసిందా ?'' అన్నాడు.

సూరన్న వైద్యుడి దొడ్లోని గోతిని చూశాడు. అది చాలా పెద్దగొయ్యి. వైద్యుడు చెప్పినట్టు చేయాలంటే, పని పూర్తికావడానికి సంవత్సరమైనా చాలకపోవచ్చు.



ఈ సంవత్సరకాలమూ మరొకపని చేయక పోతే, తనకు తిండెలా గడుస్తుంది?

"అయ్యా, యిది చాలా కష్టమైన పని. మరోపనేదైనా చెప్పండి," అని సూరన్న వైద్యుణ్ణి వేడుకున్నాడు.

"నన్ను మోసంచేసి, ఊరికే నా చేత వైద్యం చేయించుకున్నావు. అందుకు నీకీ శిక్ష తప్పదు. లేదంటావూ—నాకు నాలుగు బంగారు కాసులిచ్చుకో," అన్నాడు వైద్యుడు.

సూరన్న వైద్యుడు చెప్పినట్లే చేయ సాగాడు. వాడిల్లు వైద్యుడింటికి చాలా దూరం. రోజూ తన యింటి పెరట్లో గొయ్యి తవ్వి మట్టి తీసి గంపలో ఎత్తి మోసుకు వెళ్ళి, వైద్యుడింటి దొడ్లోని గోతిలో వేసేవాడు.

రోజులు గడుస్తున్న కొద్దీ, సూరన్న దొడ్లోని గొయ్యి పెద్దదవుతున్నది తప్ప, వైద్యుడింట్లోని గొయ్యి మాత్రం నిండడం లేదు. అందరూ సూరన్న అవస్థచూసి జాలి పడేవారు. కొందరైతే వైద్యుడికిది తగదని. మందలించారు కూడా. కానీ వైద్యుడు చలించలేదు.

కొందరు గ్రామస్థులు సూరన్నతో "వెర్రివాడా, యిది నీకు తగనిపని. ఆ వైద్యుడు నిన్నేమీ చేయలేడు. అర్థం లేని యీ పని కట్టిపెట్టు," అని సలహా యిచ్చారు.

అందుకు సూరన్న, "వైద్యుడు నాకేమైనా అన్యాయం తలపెడితే, అయనే అనుభవిస్తాడు. నా శాపం అయనకు తగుల్తుంది. నేను మాత్రం ఆయన చెప్పినట్లే చేస్తాను. మోసం చేశాననిపించు కుంటే, నాకు తృప్తిగా వుండదు," అన్నాడు.

ఇలా రోజులు గడుస్తున్నాయి. సూరన్న పరిస్థితికి జాలిపడినవారు, వాడికి పిలిచి భోజనం పెడుతూండేవారు. సూరన్న మాత్రం వైద్యుడింటి దొడ్లో గోతిని పూడ్చే ప్రయత్నం రోజు తప్పకుండా కొనసాగిస్తూనే వున్నాడు.



ఒక రోజున వాడికి దొడ్లో తవ్వుతూండగా, ఖణేళ్ అన్న శబ్దం వినిపించింది. తడిమిచూడగా రెండు రాగిబిందెలు అక్కడున్నవి. రెండింటి నిండా బంగారు కాసులున్నవి. అప్పుడు సూరన్నకు కలిగిన ఆనందం అంతాయింతా కాదు. వాడొక గుప్పెడు బంగారు కాసులు తీసుకుని, వైద్యుడింటికి వెళ్ళాడు. ఇంట్లో వైద్యుడు లేదు; పద్మిని మాత్రం వున్నది.

సూరన్న పద్మినికి జరిగినదంతా చెప్పి, "నా శ్రమ వృథా పోలేదు. మా నాన్న చెప్పినట్లే, నా శ్రమకుతగ్గ ప్రతిఫలం లభించింది," అన్నాడు.

"అయితే నీవిక మట్టి తవ్వి పోయనవసరం లేదు. నాలుగు బంగారు కాసులు నాకివ్వు. నాన్న వచ్చాక జరిగింది చెబుతాను. రెండు బిందెల బంగారు కాసులు నీ దగ్గిర చేరాయని తెలిశాక, పెళ్ళి సంగతి మాట్లాడేందుకు నాన్న స్వయంగా నీ దగ్గిరకు వస్తాడు. ఇక వెళ్ళు!" అన్నది పద్మిని సంతోషంగా.

సూరన్న ఇంటికి వెళ్ళి, నలుగురికీ తనకు బంగారం దొరికిందని చెప్పాడు. వాడి మంచితనానికి తగ్గ ప్రతిఫలమే లభించిందని, అందరూ సంతోషించారు.

అప్పుడొక పెద్ద మనిషి, "అంతా సూరన్న తండ్రి చెప్పినట్లే జరిగింది. మరి సూరన్నకు అన్యాయం చేసినందుకు, వైద్యుడి కెలాంటి శాపం తగుల్తుందో ఏమో!" అన్నాడు.

ఇది జరిగిన రెండు రోజులకు వైద్యుడు ఇంటికి తిరిగి వచ్చాడు. అయన మూలికలు తేవడానికని, సమీపారణ్యంలోకి వెళితే, ఒక ఎలుగుబంటు తరిమింది. అయన భయపడి ఒక గుహలోకి పరుగుతీశాడు. ఆ గుహలో నలుగురు బందిపోటు దొంగలు దోచిన డబ్బు పంచుకుంటున్నారు.

వాళ్ళు వైద్యుణ్ణి చూసి అనుమానించి బాగా చితకబాదారు. అయన రాజభటుడు కాదని తెలిశాక, దగ్గిరే వుంచుకుని చాకిరీ



చేయించుకున్నారు. రెండు రోజులపాటు వాళ్ళకు వంట చేసి, బట్టలుతికి, ఒళ్ళు పట్టి వైద్యుడు తనలో తానే కుమిలికుమిలి ఏడ్చాడు. అలవాటు లేని పనులకాయన ఒళ్ళు హూనమైపోయింది.

బందిపోట్లు, ఆయనను వదిలిపెట్టే ముందు, మరొకసారి బాగా కొట్టి, "మా గురించి ఎవరికీ చెప్పకు. చెబితే నీ బుద్ధి బయటపడుతుంది తప్ప, మాకేమీ ప్రమాదం లేదు," అని అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

గ్రామస్థులందరూ వైద్యుణ్ణి చూడడానికి వెళ్ళారు. జరిగింది విని, "ఒక విధంగా నువ్వు చాలా అదృష్టవంతుడివి. బందిపోట్లు సాధారణంగా తమకు దొరికిన వాణ్ణి ప్రాణాలతో వదిలిపెట్టరు. శాశ్వతంగా తమకు బానిసగా చేసుకుంటారు!" అన్నాడొక పెద్ద మనిషి.

"అసలిదంతా నువ్వు, సూరన్నకు చేసిన అన్యాయంవల్లనే జరిగింది. భగవంతుణ్ణి నమ్ముకుంటే వాడి శ్రమకు ప్రతిఫలం లభిస్తుందనీ, వాడి శాపం ఫలిస్తుందనీ—వాడి తండ్రి వాడికి చెప్పాడట. ఇప్పుడంతే జరిగింది!" అని, మరొక పెద్ద మనిషి సూరన్నకు పట్టిన అదృష్టం గురించి చెప్పాడు.

ఇది విన్న వెంటనే వైద్యుడు, "మీరు చెప్పింది నిజమే! సూరన్నకు నేను చాలా అన్యాయం చేశాను. ఇప్పుడు వాడికి, నా కూతురు నిచ్చి పెళ్ళి చేసి, నా పాపం కడిగేసుకుంటాను. ఏడీ సూరన్న?" అంటూ దిక్కులు చూశాడు.

ఆ సమయంలో సూరన్న, అక్కడ చేరినవాళ్ళల్లోనే వున్నాడు. వాడు నేల మీద కూలబడి గుండెలు బాదుకుంటూ ఏడ్వసాగాడు. వాడెందుకు ఏడుస్తున్నాడో ఎవరికీ అర్థం కాలేదు. అంతా వాణ్ణి ఓదార్చడానికి ప్రయత్నించసాగారు.

కొందరు, సూరన్న తన శాపం వైద్యుణ్ణి బాధపెట్టినందుకు విచారిస్తున్నాడన్నారు. మరి కొందరు, పద్మినిని పెళ్ళి చేసుకోవడం

వాడి కిష్టం లేదనుకున్నారు. కారణం తెలుసుకుందామంటే—సూరన్న ఏడుపు నాపడం లేదు. క్రమంగా ఒక్కరొక్కరే అక్కణ్ణించి వెళ్ళిపోయారు. చివరకు అక్కడ సూరన్న, వైద్యుడు, పద్మిని మాత్రం మిగిలారు.

''ఎందు కేడుస్తున్నావు? సమీ పారణ్యంలో బందిపోట్లున్నారు గదా. నీ బంగారానికి ప్రమాదమేమోనని బెంగగా వున్నదా?'' అని అడిగింది పద్మిని.

''అదేంకాదు. అందరూ మీ నాన్న కష్టాలకు, నా శాపమే కారణమని అంటున్నారు,'' అన్నాడు సూరన్న ఎంతో బాధగా.

''అంటే అన్నారులే, అది నిజమేకదా! నువ్వు శపించినా, శపించకపోయినా, నా తప్పులకు ఆ మాత్రం శిక్షపడదా,'' అన్నాడు వైద్యుడు, సూరన్నను ఓదార్చుతూ.

''కానీ, నీ తప్పులకు అంతేనా శిక్ష?'' అన్నాడు సూరన్న.

పద్మిని వాడి ఏడుపుకు కారణం అర్థమై ఫక్కుమని నవ్వింది. వైద్యుడి ముఖం మాడిపోయింది.

అది చూసి పద్మిని, ''నాన్నా, ఒకరికి పని చేయడమే తప్పు. ద్వేషమంటే ఏమీ తెలియని అమాయకుడు సూరన్న. అలాంటివాడు, నీ తప్పులకు నువ్వను భవించిన శిక్ష చాలదనుకుంటున్నాడు. అంటే, ఆ అమాయకుడి మనసును, నువ్వెంతగా క్షోభపెట్టావో ఆలోచించుకో. అమాయకుడి శాపం పూరికేపోదు. అది మళ్ళీ మళ్ళీ నిన్ను వేధిస్తుంది. సూరన్న మనసులో, నీపట్ల కలిగిన ద్వేషాన్ని ముందు పోగొట్టు,'' అన్నది.

వైద్యుడు సూరన్న ముందు, తన తప్పులన్నీ ఒప్పుకుని, అన్నివిధాలా వాడికి అనుకూలంగా ప్రవర్తిస్తానని చెప్పాడు. సూరన్న తన ద్వేషాన్ని క్రమంగా మరిచి పోగలిగాడు.

తర్వాత సూరన్న, పద్మినిని వివాహం చేసుకుని చాలా కాలం సుఖంగా జీవించాడు.



# కాలక్షేపం

రామేశ్వరం పోతున్న యాత్రికులతోపాటు, యిద్దరు యువకులు ప్రయాణం చేస్తున్నారు. వాళ్ళల్లో ఒకడు, రెండోవాణ్ణి, "అవునూ—అన్నట్టు, మనదే ఊరు?' అని అడిగాడు.

"కమలాపురం," అన్నాడు రెండోవాడు.

"అలాగా! మాదీ అదే ఊరు. మీరుండేది, ఏ వీధిలో?" అని ప్రశ్నించాడు మొదటివాడు.

"జగదాంబ వీధి," అన్నాడు రెండోవాడు.

"విడ్డూరంగా వుందే! మాదీ అదే వీధి. వీధిలో ఎటువైపు మీ ఇల్లు?" అన్నాడు మొదటివాడు.

"శివాలయానికి ఎడమవైపున వున్న రెండో ఇల్లు," చెప్పాడు రెండోవాడు.

"నేనుండేదీ, ఆ ఇంట్లోనే!" అన్నాడు మొదటివాడు ఆశ్చర్యపోతూ.

ఇదంతా వింటూన్న తోటి యాత్రికులు, "ఏమయ్యా, మీ ఇద్దరూ వుండేది ఒకే ఊరు, ఒకే వీధి అంటున్నారు. ఇంతవరకూ ఒకర్నొకరు ఎరగరా?" అని అడిగారు.

"ఎరక్కపోవడం ఏమిటి? మేమిద్దరం అన్నదమ్ములం. దూరప్రయాణం గదా అని, కాలక్షేపానికి ఏదో మాట్లాడుకుంటున్నాం," అని నవ్వుతూ జవాబిచ్చారు, ఇద్దరు యువకులూ.

వాళ్ళ పిచ్చినరదా చూసి, మిగిలిన యాత్రికులు పెద్దగా నవ్వడం ప్రారంభించారు.

—బి. రఘురామరాజు






# 8

[జ్ఞానభూమి నుంచి వినోదుడు మరొక కొత్తప్రాంతాన్ని చేరుకుని అక్కడి మునితో కలిసి అదృశ్యంగా పట్టణ సంచారం జరిపాడు. ఆ ప్రజల ధనాశకూ, అజ్ఞానానికీ ముని బాధపడ్డాడు. ముని సృష్టించిన వింత పుచ్చకాయ బద్దలై ప్రజలపై బడింది. ఆ ముక్కలను అందరూ తినేశారు. విచారగ్రస్తమైన పట్టణాన్ని వదలి మునీ, వినోదుడూ వెళ్ళిపోయారు. తరవాత—]

వినోదుడు వింత జలపాతం దాటి అవతలికి వెళ్ళి కొన్ని రోజులే అయినప్పటికీ, బంగారులోయ రాజు మాత్రం ఓర్పును కోల్పోయాడు. వినోదుడు ఎప్పుడెప్పుడు తిరిగి వస్తాడా అని ఎదురుచూడసాగాడు. వినోదుడి రాకను తనకు వెంటనే తెలియజేయడానికి అనువుగా కొండల మీదా, ఎత్తయిన చెట్ల మీదా భటులను ఏర్పాటు చేశాడు!

మామూలుగా రాజు భోజనానికి కూర్చున్న సమయంలో, మరీ లడ్డూలను చూసీ చూడగానే, ఆయనకు బంగారు స్త్రీ విగ్రహం జ్ఞాపకం వచ్చేది. మరుక్షణమే అక్కణ్ణించి ఉరుకులతో పరుగులతో శిథిలాల మధ్య ఉన్న బంగారు విగ్రహం దగ్గరికి చేరుకునేవాడు. తీరా అక్కడ చేరాక, భోజనం సగంలోనే వదిలివచ్చానే అని తెగ బాధ పడేవాడు. అందువల్ల,

మనోజ్ దాస్



తను అలా వదిలివచ్చిన భోజనాన్ని దాదాపు ముప్పై పళ్ళాలతో తాను ఉన్న స్థలానికి తీసుకురావడానికి ముప్పైమంది సేవకులను ఏర్పాటు చేశాడు!

రాజు తరచూ మంత్రినీ, మహాజ్ఞానులనూ చూసి, "ఇప్పుడు నేనెలా ఉన్నాను?" అని అడిగేవాడు.

రాజు అందంగా కనిపించడానికి ఎటువంటి శ్రద్ధ తీసుకుంటున్నదీ వారికి బాగా తెలుసు. మామూలుకన్నా ఆయన ఇప్పుడు రెండింతలు భోజనం చేస్తున్నాడు. రోజూ శుభ్రమైన వెన్నతో స్నానం చేస్తున్నాడు. మూడు రోజులకోసారి జుట్టు కత్తిరించుకుంటున్నాడు. రెండు రోజులకోసారి మీసం కత్తిరించుకుంటూ, రోజుకు రెండుసార్లు సంపెంగనూనె రాసుకుంటున్నాడు. విలువైన దుస్తులతోపాటు, ప్రతి వేలుకూ రెండేసి ఉంగరాలూ, మెడనిండా వజ్రాలహారాలూ ధరిస్తున్నాడు. బంగారు స్త్రీ విగ్రహానికి ప్రాణం వస్తే, ఆమెను వివాహమాడడానికే ఈ ప్రయాసలన్నీ!

"మీరు అపురూప సౌందర్యంతో వెలిగిపోతున్నారు చండమార్తాండ మహాప్రభూ!" అనేవాళ్ళు మంత్రీ, మహాజ్ఞానులు. ఇటువంటి మామూలు మాటలు రాజుకు అంతగా తృప్తికలిగించడం లేదని గ్రహించిన మహాజ్ఞానులు, ఇంకా పెద్దపెద్ద మాటలతో, కొత్త కొత్త ఉపమానాలతో పొగడి రాజుగారి మన్ననలు పొందడానికి ప్రయత్నించేవారు. "అందమైన పుష్పంలాగా ఉన్నారు ప్రభూ!" అని కొందరంటే, "రంగురంగుల సీతాకోకచిలుకలా వెలిగిపోతున్నారు మహాప్రభూ!" అని మరికొందరనేవారు. "మీ అందం ఇంద్రధనుస్సులా మెరిసిపోతోంది మహారాజా!" అని ఇంకా కొందరు పొగడేవారు.

రాజాస్థానంలో ఉన్న ఇద్దరు కవులు రాజుగారి అందాన్ని వర్ణిస్తూ కొత్త కొత్త ఉపమానాలను మహాజ్ఞానులకు అందించి, వారి నుంచి ధనం పుచ్చుకునేవారు.



కవులు కొత్త పదజాలం కూడా రూపొం దించారు. ఆ మాటలకు అర్థం తెలియక పోయినా, కాస్త గంభీరంగా వినిపిస్తే చాలు—రాజు ఎంతగానో పొంగిపోయే వాడు. కొనగోటితో గొప్పగా మీసం దువ్వు కునేవాడు!

మహాజ్ఞాని అయిన వృద్ధమంత్రి ఒక నాడు రాజుతో, "చండమార్తాండ మహా ప్రభూ, ఆ బంగారు విగ్రహం ఒక్కసారి నవ్వితేచాలు; వెంటనే ఆమె కళ్ళు తెరుచు కుంటాయి; గుండె కొట్టుకోవడం ప్రారం భిస్తుంది. కంటిచూపూ, హృదయం ఉన్న ఏ అందాలరాశిగాని తమ సౌందర్యాన్ని చూసి ప్రేమించకుండా ఉండజాలదు!" అన్నాడు.

రాజు తల పంకించాడు. మంత్రి మాటలు బాగానే ఉన్నాయి. అయినా, ఆ విగ్రహాన్ని నవ్వేట్టు చేయడం ఎలా? ఈ సమస్యను పరిష్కరించడానికి రాజు తీవ్రంగా ఆలోచించాడు. రాజ్యంలోని పేరుమోసిన హాస్యగాళ్ళందరినీ రప్పిం చాడు. ఖజానాలోని ధనాన్ని ధారాళంగా వెచ్చించి వాళ్ళకు వింత వింత దుస్తులు కుట్టించాడు. వాళ్ళందరినీ విగ్రహం ముందుకు నడిపించి నాట్యం చేయ మన్నాడు; చేష్టలు చేయమన్నాడు. వాళ్ళు అలాగే చేశారు; అలిసిపోయారు. అయినా, భటులు కత్తి చూపి బెదిరించి వాళ్ళు స్పృహతప్పి పడిపోయేవరకు ఆడించారు. అయినా విగ్రహం నవ్వలేదు.

ఇక ఇది లాభం లేదనుకుని రాజు, విగ్రహాన్ని నవ్వించినవారికి గొప్ప బహు మానం ఇస్తామని చాటింపు వేయించాడు.

ఒకనాటి రాత్రివేళ, బంగారు విగ్రహం ముందు బ్రహ్మాండమైన మెరుపు మెరి సింది. విగ్రహం నవ్వడమే అలా మెరిసిం దని భావించిన కాపలాభటుడు, రాజు దగ్గరికి పోయి బంగారు విగ్రహం నవ్విం దని చెప్పాడు. భోజనం చేస్తూన్న రాజు, ఉన్నపళంగా బయలుదేరి పరుగు పరు గున బంగారు విగ్రహం దగ్గరికి చేరాడు.



విగ్రహాన్ని ఎంత పరిశీలించి చూసినా, రాజుకు నవ్వు కనిపించలేదు. ఆయన కాపలాభటుడి కేసి తిరిగి, "నీకు మంచి బహుమానం ఇస్తాను. అయితే, బంగారు విగ్రహం నవ్వినప్పుడు మొట్టమొదట చూసే హక్కూ, అర్హతా, అధికారం నాకే ఉన్నాయి. కాబట్టి ఇప్పుడే నీ కళ్ళు పీకిస్తాను," అన్నాడు ఆగ్రహంతో.

కాపలాభటుడు భయంతో గడగడ వణికిపోయాడు. అదృష్టవశాత్తు రాజు అజ్ఞ నెరవేర్చబడేలోపలే, వృద్ధమంత్రి అక్కడికి వచ్చి, "చండమార్తాండ మహాప్రభూ! మన రాజ్యానికి ఒక మహా మాంత్రికుడు వచ్చాడు. ఈయన గొప్ప గొప్ప అద్భుతాలు ప్రదర్శించగల మహనీయుడు!" అన్నాడు.

రాజు మాంత్రికుడి కేసి చూశాడు.

"అవును మహాప్రభూ! తమరు అనుమతిస్తే నేనెన్నో అద్భుతాలు చూపగలను," అంటూ చేతులు తట్టాడు మంత్రి వెంట వచ్చిన మాంత్రికుడు.

మరుక్షణమే మాంత్రికుడి శిష్యుడు అక్కడి కొక ఎలుగుబంటిని లాక్కొచ్చాడు.

"ఇప్పుడు మీరేం చూస్తున్నారు మహారాజా?" అని అడిగాడు మాంత్రికుడు.

"ఎలుగుబంటిని మచ్చిక చేసుకోవడం అద్భుతం కాదు. కంపుకొడుతున్నది, తీసుకుపో దాన్ని అవతలికి," అన్నాడు రాజు కోపంగా.

"చిత్తం మహారాజా, అయినా, దాన్ని అట్టేసేపు ఎలుగుబంటిగా వుంచను," అంటూ మాంత్రికుడు నవ్వుతూ, ఎలుగుబంటిని కాలితో తన్నాడు. అది కింద పడుకున్నది. మరుక్షణమే మాంత్రికుడి శిష్యుడు దాన్ని ఒక దుప్పటితో కప్పేశాడు. మాంత్రికుడు మంత్రదండంతో అక్కడక్కడా తడుతూ, దానిని మూడుసార్లు చుట్టివచ్చాడు. దుప్పటి కింద ఎలుగుబంటి తన్నుకుంటున్నట్టు అనిపించింది. మాంత్రికుడు కొంతసేపు ఏవేవో మంత్రాలు



వల్లించి చివరికి 'హాం....ఫట్' అన్నాడు కనుబొమలు ముడివేసి. మరుక్షణమే ఒక మనిషి దుప్పటిలో నుంచి బయటికి దూకి ముందుకువచ్చి నిలబడ్డాడు. వాణ్ణి రాజు పరిశీలనగా చూశాడు. వాడిలో ఎలుగుబంటి లక్షణాలు గాని, గురుతులు గాని ఏమాత్రం లేవు. రాజు అమితాశ్చర్యం చెందాడు!

అది రాత్రి సమయం కావడం వల్ల అక్కడ అంతగా జనం లేరు. విగ్రహానికి కాపలా ఉన్న భటులూ, రాజు సగంలో వదిలివచ్చిన భోజనం తీసుకువచ్చిన సేవకులూ ఉన్నారు. వాళ్ళు రాజుతో మాట్లాడకూడదు. కొందరు ఆస్థానోద్యోగులున్నప్పటికీ, రాజు మాటకు ఎదురాడడం క్షేమం కాదని వారికి తెలుసు. కాబట్టి ఒక్కరు కూడా నోరు కదపలేదు. మాంత్రికుడు ఎలుగుబంటిని మనిషిగా మార్చాడని రాజు నమ్మాడు. తామూ నమ్ముతున్నట్టు మంత్రులూ, ఆస్థానోద్యోగులూ నటించారు. మనిషికి ఎలుగుబంటి వేషం తగిలించి తీసుకువచ్చి, మాంత్రికుడు మోసం చేశాడేమో అని కొందరు అనుమానించారు. కాని, ఆ మాట పైకి చెప్పడానికి సాహసించలేక పోయారు!

ఆ కొత్త మనిషి ఇంకా ఎలుగుబంటి లాగానే గుర్రుపెడుతున్నాడా? అని చూడడానికి వచ్చిన మంత్రి ముక్కును వాడు గాయపరిచాడు!

''మహాప్రభూ, ఇతడు త్వరలోనే గుర్రుపెట్టడం మానేయగలడు. రేపీపాటికి చక్కగా మాట్లాడగలడు. ఆపైన గోళ్ళకు బదులు మనలా కత్తులూ, కఠారులూ ఉపయోగించగలడు!'' అన్నాడు మాంత్రికుడు.

ఆస్థానోద్యోగులు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"మహాప్రభూ, ఎలుగుబంటిని మనిషిగా మార్చగల నా మంత్రశక్తిని గురించి మీరేమనుకుంటున్నారు?'' అని అడిగాడు మాంత్రికుడు.

రాజు కొంతసేపు ఆలోచించి, తల పంకించి, "నేనిప్పుడేమి అనుకుంటున్నదీ చెబుతాను విను. కావాలంటే నువ్వు ఇంకొక ఎలుగుబంటిని కూడా మనిషిగా మార్చగలవు. అయినా అవసరం లేదు. మాదిరికి ఒక్కటి చాలు!" అన్నాడు.

"ఆహా! ఆహా! ఎంత వివేకం! ఎంత వివేకం!" అన్నారు ఆస్థానోద్యోగులు ఏక కంఠంగా.

"మహాప్రభూ, ఎలుగుబంటిని మనిషిగా మార్చిన నేను బంగారు విగ్రహాన్ని స్త్రీగా మార్చలేనా?" అనిఅడిగాడుమాంత్రికుడు.

"ఎందుకు మార్చలేవూ? ఆహా, ఆనందంతోఎగిరి గంతేయాలని ఉన్నది.అయినా ఎగురలేకున్నాను!" అన్నాడు రాజు.

"మీ బొజ్జ మీకు భారంగా ఉన్నది మహారాజా! అయినా, బంగారు విగ్రహం ప్రాణాలతో లేచి వచ్చేసరికి, మీ బొజ్జ కరిగిపోగలదని హామీ ఇస్తున్నాను," అన్నాడు మాంత్రికుడు.

"మహామాంత్రికా! ఇప్పుడే నీ మాయా దుప్పటితో ఆ విగ్రహాన్ని మూసేద్దాం. నీ ఇష్టానుసారం ఆ విగ్రహాన్ని మంత్ర దండంతో కొట్టు, వద్దనను. నన్ను ఇంత కాలం కాచుకునేట్టు చేసిన ఆకతాయిరాలికి అప్పుడే నా కష్టం తెలిసివస్తుంది!" అన్నాడు రాజు.



"అది సాధ్యం కాదు మహారాజా! ఆ విగ్రహానికి ప్రాణం తెప్పించడానికి మనం వేరొక మార్గం అనుసరించాలి. అందుకు మీరు ఒక వారం పాటు ఉపవాసం ఉండాలి. ఆ తరవాత, విగ్రహానికి వెనుక ఉన్న గుహలో మీరు ధ్యానం చేయాలి. అప్పుడే మనం అనుకున్నది సాధించ గలం," అన్నాడు మాంత్రికుడు చాలా గంభీరంగా.

"ఉపవాసమా! ఒకవారం వరకా?" అన్నాడు రాజు భయపడిపోతూ.

"వారానికి ఒక్క నిమిషం కూడా తగ్గ డానికి వీలుకాదు మహాప్రభూ," అన్నాడు మాంత్రికుడు.

''లడ్డూలు మాత్రం తీసుకోవచ్చా?'' అన్నాడు రాజు ఆశతో.

''సాధ్యంకాదు మహాప్రభూ,'' అన్నాడు మాంత్రికుడు.

''అడపాదడపా కోడి మాంసమయినా తినవచ్చా?'' అన్నాడు రాజు సగం తిని వదిలివేసిన పళ్ళాలకేసి విచారంగా చూస్తూ.

''కోడి కాదు కదా, కోడి గుడ్డు కూడా తాకడానికి వీలులేదు,'' అని మాంత్రికుడు రాజుకేసి జాలిగా నవ్వుతూ, ''ఈ ఉపవాసం పూర్తయ్యాక, నేను ప్రాణాలు తెప్పించనున్న అప్సరస సరసన కూర్చుని పంచభక్ష్య పరమాన్నాలను ఆరగించే అదృష్టాన్ని ఊహించి చూడండి మహాప్రభూ! అంతేకాదు. అప్సరసను పెళ్ళాడిన మొట్టమొదటి మహారాజుగా మీ పేరు చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతుంది!'' అంటూ రాజు వెన్ను తట్టాడు.

రాజు అంగీకార సూచనగా, మౌనంగా తలాడించాడు.

''మీకు సానుభూతి కనబరుస్తూ, నేను కూడా మీతోపాటు ఉపవాసం ఉండాలనుకుంటున్నాను,'' అని మాంత్రికుడు ఇంకేదో అనబోయేంతలో, ''మేమందరం కూడా రాజుగారితో పాటు ఉపవాసం ఉంటాం!'' అన్నారు మంత్రీ, ఆస్థాన ఉద్యోగులూ ఏకకంఠంగా.

''చాలా బాగుంది! చండమార్తాండ మహాప్రభువులవారే ఉపవాసం ఉంటూన్నప్పుడు, ఎవరికి మాత్రం తినాలని బుద్ధి పుడుతుంది? అయినా ఈ వారమంతా నేను రాజుగారికోసం చాలా శ్రమించవలసి ఉన్నది. కాబట్టి నేను ఆహారం లేకుండా బలహీనమైపోకూడదు. ప్రభువులవారు అపార్థం చేసుకోకుండా ఉన్నట్టయితే, ఆయన ఆహారాన్నంతా ఈ వారంపాటు నేనే భుజించాలి. అప్పుడే మనం అనుకున్న పని నిరాటంకంగా సఫలమవుతుంది,'' అన్నాడు మాంత్రికుడు.

''అలాగే, నీ ఇష్టానుసారమే చెయ్,'' అన్నాడు రాజు. —(ఇంకావుంది)






# సువర్ణయోగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, తలపెట్టిన కార్యం సాధించి తీరాలనే, నీ పట్టుదల కొనియాడదగిందే. అయితే ఒక్కొక్కసారి ఎంతో శ్రమా, పట్టుదలలతో కార్యసాధనకు పూనిన వ్యక్తుల్లో, కొందరు విపరీతమైన భంగపాటుకు గురికావడం జరుగుతూంటుంది. నువ్వు అలాంటి వారిలో ఒకడివేమో అన్న శంక కలుగుతున్నది. ఉదాహరణగా ఒక కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను." అంటూ యిలా చెప్పసాగాడు:

అరణ్యంలో పక్షులను వేటాడి జీవించే కాలు డనే వాడికి, ఒకనాడు ఏ పక్షి దొరకక అరణ్యమంతా తిరిగి అలసిపోయి,

## బేతాళ కథలు



ఒక చెట్టు కింద కూర్చున్నాడు. అప్పుడు బంగారు కాంతితో మెరిసిపోతున్న హంస ఒకటి ఎగురుతూ, చెట్టు కేసి రాసాగింది. కాలుడు చప్పున బాణం ఎక్కుపెట్టి, దాని కేసి వదిలాడు. బాణం హంస శరీరం లోంచి దూసుకుపోయింది. అయినా, హంస నేలకూలక, అలా ఎగిరిపోసాగింది.

కాలుడు యీ వింత చూసి ఆశ్చర్య పడుతూ, దాని వెంటపడ్డాడు. వాడికి హంస శరీరం నుంచి రాలిన రెండు ఈకలు దొరికాయి. అవి బంగారు కాంతితో మిలమిలలాడుతున్నవి.

కాలుడు, బంగారుహంస ఎగిరిపోయిన దిక్కు కేసి నడవసాగాడు. వాడికి ఎలా గైనా దానిని పట్టుకోవాలన్న పట్టుదల కలిగింది. చీకటిపడేవేళకు, వాడికి ఒక చోట ముసలివా డొకడు తారసపడ్డాడు. వాడి చేతిలో రకరకాలవేళ్ళూ, మూలి కలూ వున్నవి. కాలుడు, ముసలివాడికి హంస గురించి చెప్పి, తన దగ్గిర వున్న ఈకలను అతడికి చూపించాడు.

ముసలివాడు వాటిని పరీక్షగా చూసి, "ఇవి అచ్చమైన బంగారు ఈకలు! నిజంగా నువ్వీ బంగారుహంసను చూశావా?" అని ప్రశ్నించాడు.

కాలుడు జరిగింది చెప్పగానే, ముసలి వాడు తనను గురించి చెప్పుకున్నాడు.

మణిసిద్ధి అనే ఆ ముసలివాడు, ఒక జమీందారు కొడుకు. అతడు ఐదేళ్ళ వయసులో వుండగా, జమీందారు తీవ్ర మైన వ్యాధికి గురయ్యాడు. ఆయన వద్ద మణుగులకొద్దీ బంగారం వున్నది. తాను చనిపోతే, ఆ బంగారం అంతా తన దాయా దులు చేజిక్కించుకుంటారని భయపడ్డా డాయన. జమీందారు గొప్ప మంత్రశక్తు లున్నవాడు. ఆ శక్తుల నుపయోగించి ఆయన, బంగారాన్నంతా ఒక గుహలో నికి క్షిప్తపరిచి, ద్వారాన్ని దిగ్బంధనం చేసి—దాన్ని ఎలా తెరవాలో ఒక రాగి రేకు మీద లిఖించి, భార్య పరం చేసి మరణించాడు.

మణిసిద్ధి తల్లి, ఆ రేకును ప్రాణ ప్రదంగా కాపాడుకుంటూ, కొడుకు పెద్ద వాడయాక దాన్ని అతడికివ్వాలనుకున్నది. అయితే, దురదృష్టవశాత్తూ, ఆ రేకు ఒక సారి నిప్పుల్లోపడి కరిగిపోయింది. దిగులుతో మణిసిద్ధి తల్లి మంచంపట్టి, కొద్ది రోజుల్లోనే మరణించింది.

దానితో మణిసిద్ధి బికారీ అయి పోయాడు. జమీందారు కొడుకుగా తనగత వైభవాన్ని తిరిగిపొందాలన్న పట్టుదలతో అతడు, క్షుద్రలోహాలనుంచి బంగారం తయారుచేసే పరుసవేదులకూ, రసవాదు లకూ శుశ్రూషలు చేయసాగాడు. అయినా ముసలితనం ముంచుకువచ్చినా, ఆ ప్రయత్నంలో సఫలుడు కాలేకపోయాడు.

''ఈ బంగారు హంసను పట్టితీరాలి! నేనూ నీ వెంటవస్తాను,'' అన్నాడు మణిసిద్ధి.

కాలుడూ, మణిసిద్ధీ హంసను వెతుకుతూ బయలుదేరారు. వాళ్ళు మర్నాటి మధ్యాహ్నంవేళకు, ఒక నదీతీరం చేరారు. అక్కడ ఒక సాధువు, చెట్టు కొమ్మకు రెండుకాళ్ళూ పెనవేసి తల కిందులుగా వేళ్ళాడుతున్నాడు. కింద చితి ఒకటి భగ్గుమంటూ పెద్దగా మండు తున్నది. ఆ వేడిని భరిస్తూ, అతడు తీవ్రమైన తపస్సు చేస్తున్నాడు.



కాలుడూ, మణిసిద్ధీ ఆశ్చర్యపోతూ సాధువును సమీపించేంతలో, అతడు కళ్ళు తెరిచి వాళ్ళకేసి వింతగా చూసి, ''ఎవరు మీరు? ఈ మహారణ్యంలో మీకేం పని?'' అన్నాడు.

కాలుడు సంగతి చెప్పాడు. సాధువు వెంటనే చెట్టుకొమ్మనుంచి చితిమంటల్లోకి దూకి వేగంగా వాళ్ళను సమీపించి, ''అయ్యలారా, నాపేరు వజ్రకంఠుడు. నా తండ్రి రాజుగారిదగ్గిర కోశాధికారి. నేను సామాన్య సైనికుడను. ఒకసారి కోశాగారంలో పెద్ద ఎత్తున దొంగతనం జరిగింది. రాజు, నా తండ్రిని అనుమా నించి చెరసాలలో పెట్టించాడు. కొన్నాళ్ళ



తర్వాత, ఒక బందిపోటు ముఠా నగర శివార్లలో దోపిడీకి వచ్చింది. నేనూ, మరి కొందరు సైనికులం, వాళ్ళను ఎదిరించి ఘోరంగా పోరాడాం. బందిపోట్లలో చావగా మిగిలినవాళ్ళల్లో, వాళ్ళ నాయకుడు మాకు బందీ అయాడు. వాడి మెడలో వున్న హారం, కోశాగారంనుంచి దొంగిలించ బడినదని నేను గుర్తించి, వాణ్ణి రాజు గారికి అప్పగించాను. అయితే, యీ లోపలే అవమానాన్ని భరించలేక, నా తండ్రి ఆత్మ హత్య చేసుకున్నాడు.

నేను తండ్రిపోయిన దుఃఖంతో సన్యా సుల్లో కలిసి, దేశదేశాలు తిరిగాను. ఈ జన్మలోనే ఏనాటికైనా రాజు కావాలన్నది, నా ఆకాంక్ష. ధనం వుంటే ఎంతోమంది సైనికులను సమకూర్చుకోవచ్చు. సైనిక బలంతో రాజ్యాన్ని జయించి రాజు కావడం, ఏమంత కష్టంకాదు. ఒక మహత్తులు గల సన్యాసి ఉపదేశించగా, నేను లక్ష్మీకటాక్షంకోసం, యిక్కడ తపస్సు చేస్తున్నాను,'' అని చెప్పాడు.

అంతలో బంగారుహంస రెక్కల ల్లాడిస్తూ, వాళ్ళమీదగా ఎగిరిపోయింది. అది చూస్తూనే, వజ్రకంఠుడు, ''ఆహాఁ, ఇది బంగారుహంస! మనకు తప్పక సువర్ణయోగం వున్నది! హంసలు ఒంటరిగా కాక, గుంపులుగా నివసించే జీవులు, ఇక్కడెక్కడో వాటి నివాస స్థానమైన సరోవరం వుంటుంది, పదండి!'' అన్నాడు ఉత్సాహంగా.

ముగ్గురూ కలిసి బంగారుహంస ఎగిరి పోయిన మార్గాన బయలుదేరారు. దారిలో వాళ్ళకొక శిథిలావస్థలో వున్న కాళికా లయం కంటబడింది. అక్కడ కాళీ మాతకు పూజ చేస్తున్న పసివాణ్ణీ, పక్కనే రాతి మీద కత్తికి పదును పెడుతున్న ఒక దృఢకాయుణ్ణీ చూసి, వాళ్ళు నివ్వెర పోయారు.

ముగ్గురూ కూడబలుక్కొని హఠాత్తుగా, ఆ దృఢకాయుడి మీదపడి పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు.

వాడు గింజుకుంటూ, "నా కొడుకును, నేనేమైనా చేసుకుంటాను, అడ్డగించేందుకు, మీరెవరు ?" అంటూ అరిచాడు.

వజ్రకంఠుడు, వాణ్ణి మందలిస్తూ, "అసలు సంగతేమిటి ?" అని అడిగాడు.

దానికి వాడు, "నా పేరు మాణిక్యవర్మ. తరతరాలుగా, మేమీ దేవికి పూజారులం. నాకు ముగ్గురు కొడుకులు. ఆ మధ్య పెద్ద వాడికి జబ్బు చేస్తే, సరి అయిన వైద్యం చేయించేందుకు డబ్బు లేకపోయింది. వాడు పోయాడు. నేను దుఃఖంతో కుంగిపోయి, కాళీమాతను నిందిస్తూ, రాత్రి దేవాలయంలో పడుకున్నాను. కాళీమాత నాకు కలలో కనిపించి—మిగిలివున్న యిద్దరు కొడుకుల్లో ఒకణ్ణి తనకు సమర్పిస్తే, నట్టింట కనకవర్షం కురిపించగలనని చెప్పింది. అందుకే వీణ్ణి సమర్పించబోతున్నాను," అన్నాడు.

మణిసిద్ధి, వాడితో, "మూర్ఖుడా, ముందు కత్తిని దూరంగా పారవెయ్యి. మనందరికీ సువర్ణయోగం వున్నది," అని, తాము అటుగా వచ్చిన కారణం చెప్పాడు.

ఇప్పుడు నలుగురూ కలిసి, బంగారు హంస పోయిన దిక్కుగా బయలుదేరారు. మర్నాటి ఉదయానికి వాళ్లు ఒక కొండను సమీపించి, దాని శిఖరానికి ఎక్కారు. అక్కడ వాళ్ళకొక పెద్ద సరస్సు కనిపించింది. అందులో వందలకొద్ది బంగారు హంసలు, సూర్యకాంతిలో బంగారు ముద్దల్లా మెరుస్తూ విహరిస్తున్నవి. సరస్సులో ఎక్కడ చూసినా వికసించిన బంగారు కమలాలు !



ఆ దృశ్యం చూసి వాళ్ళు పరవశించిపోయారు. బోయవాడైన కాలుడు తప్ప, మిగతా ముగ్గురూ బంగారు కమలాలను చేజిక్కించుకోవడానికి సరస్సులో దిగారు.

కాలుడి దృష్టి మాత్రం బంగారు హంసలపైనే వున్నది. వాడు కూడా సరస్సులో దిగి, వాటిని పట్టుకోబోయాడు. అయితే, అవి వాడికి అందకుండా దూరంగా ఈదుకుపోసాగాయి.

కాలుడు సరస్సు నీటిలో మరికాస్త ముందుకుపోతూ, తనతో వచ్చిన వాళ్ళ కోసం తలతిప్పి పక్కకు చూశాడు. అక్కడ వాళ్ళు కనిపించలేదుగాని, మూడు బంగారు హంసలు కాలుడికేసి ముక్కులు చాచి చూస్తూ, నీళ్ళల్లో తేలియాడుతున్నవి.

అది చూసి కాలుడు ఉలిక్కిపడి, మరుక్షణమే సరస్సు నుంచి గబగబా బయటికి వచ్చి, తిరిగిచూడకుండా ఇంటి దారిపట్టాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కాలుడిలాగే మిగతా ముగ్గురు కూడా బంగారు హంసను పట్టుకునేందుకు వెళ్ళినవాళ్ళేగదా? అలాంటప్పుడు, వాళ్ళు ముగ్గురూ సరస్సులో దిగి హంసలుగా మారిపోవడం, కాలుడు మాత్రం ఆ ప్రమాదంనుంచి బయటపడడం ఎందుకు జరిగింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కాలుడు బోయవాడు. వాడి వృత్తి పక్షులనుపట్టడం. అదే వాడి జీవనాధారం. ఏ పక్షీ దొరకని సమయంలో వాడు, బంగారుహంసను పట్టేందుకు బయలుదేరాడు. వాడు మొదట్లో బాణం కొట్టింది, అది మామూలు హంస అనుకునే. మిగతా ముగ్గురి సంగతి వేరు. వాళ్ళు తమకు సువర్ణయోగం పట్టాలనే దురాశలో వున్నవాళ్ళు. ఆ కారణంవల్లనే వాళ్ళు, సరస్సులో దిగినప్పుడు హంసలమాట మరిచి, బంగారు కమలాలకోసం ఎగబడ్డారు. కాలుడు అలా చేయలేదు. వాడికి ముఖ్యం పక్షి; బంగారం కాదు. తన తోటివాళ్ళు ముగ్గురూ హంసలుగా మారడం చూడగానే, వాడికి అదేదో మహత్తుగల సరస్సన్న గ్రహింపు గలిగింది. అందుకే వాడు, హంసనుపట్టే ప్రయత్నం మాని ఇంటిదారి పట్టాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ధర్మకర్తగా తగినవాడు

మగధలో పూర్వం శైవులు, వైష్ణవులు ప్రతి చిన్న విషయానికీ ఎంతో తగవు పడేవారు. ప్రజల మధ్య వున్న, యీ భేద భావం తొలగడానికి, మగధ చక్రవర్తి మహానందుడు రాజధానిలో పాలరాతితో, ఒకపక్క శివాలయాన్నీ మరోపక్క వైష్ణవాలయాన్నీ నిర్మింపజేశాడు.

ఆ తర్వాత, ఆ రెండు ఆలయాలకూ ఎవరిని ధర్మకర్త చేయాలో ఆయనకు తోచిందికాదు. ఆయన మంత్రి మాధవ వర్మను సలహా అడిగాడు. అందుకు మంత్రి, "ప్రభూ, ధర్మకర్త అనే వ్యక్తి మంచి మాటకారి, లౌక్యం వున్నవాడైతే, యీ ఆలయాలు దిన దిన ప్రవర్ధమాన మవుతాయి. భక్తులు యిచ్చే కానుకలూ, విరాళాలూ ఎక్కువగా వస్తేనేగదా, వాటిని ప్రజాహిత కార్యక్రమాలకు ఉపయోగించడం సాధ్యపడేది!" అన్నాడు.

"అయితే, అలాంటి వ్యక్తి, మీదృష్టిలో ఎవరైనా వున్నారా?" అని అడిగాడు చక్రవర్తి.

"ఉన్నాడు, ప్రభూ. ఇలాంటి మంచి పనికి దైవభక్తీ, మంచి లౌక్యమూ, మాట కారితనమూ వున్న శివరామజోషి తగిన వాడని, నా నమ్మకం," అన్నాడు మంత్రి.

చక్రవర్తి వెంటనే, ఆ రెండు దేవాలయాలకూ ధర్మకర్తగా శివరామజోషిని నియమించాడు. కొన్నాళ్ళు గడిచాక, శివరామజోషి అధ్వర్యంలో దేవాలయాలు బాగా అభివృద్ధి చెందుతున్నట్టు, వేగుల ద్వారా చక్రవర్తికి వర్తమానం అందింది.

ఒకనాడు చక్రవర్తి మహానందుడు, ఒక పెద్ద వ్యాపారిగా మారువేషంతో శివరామ జోషిని పరీక్షించడానికి వెళ్ళాడు. ఆయన రెండు దేవాలయాలకూ మధ్యలో వున్న సత్రంలో దిగాడు.

ఎం. డి. సౌజన్య

సత్రంలో దిగిన భక్తుల్లో, మారు వేషంలో వున్న చక్రవర్తిని శివరామజోషి పోల్చుకోలేకపోయాడు. అయితే, చక్రవర్తి వేళ్ళ ఉంగరాలు చూసి, ఆయనను సంపన్నుడైన వ్యాపారి అనుకున్నాడు. ఆయన రెండు ఆలయాలూ స్వయంగా చూపి, భక్తులిచ్చే కానుకలతో, విరాళాలతో ఎలాంటి అభివృద్ధి కార్యక్రమాలు తాను నిర్వహిస్తున్నదీ వివరించాడు.

చక్రవర్తి వెంటనే ఒక తాళపత్రంమీద 'వందవరహాలు' అని అంకెవేసి, ధర్మకర్తను, "ఈ విరాళం సరిపోతుందా?" అని అడిగాడు.

శివరామజోషి చిన్నగా నవ్వి, "మీకు యిరుపక్కలా చెరొక దేవుడూ వున్నాడు. ఒక వంద ఒక్కరికే సరిపోదు. ఆ అంకె మరికాస్త పెంచండి," అన్నాడు.

చక్రవర్తి ఒకక్షణం ఆలోచించి, "ఎటు పెంచమంటారు?" అని అడిగాడు.

"ఇచ్చేది భక్తుడు. పుచ్చుకునేది దేవుడు. దానధర్మాలు గుప్తంగా చేయడమే మంచిదంటారు. సరే, అంకె పెంచాలని నిర్ణయించారు కాబట్టి, ఇంకో అంకె ఆ అంకెలకు చేర్చండి," అన్నాడు శివరామజోషి.

చక్రవర్తి వెంటనే వంద పక్కన ఒకటి వేశాడు. ఇప్పుడది వెయ్యిన్నొక్క వరహా అయింది.

అయితే, శివరామజోషి చక్రవర్తిని అంతటితో వదలక, "శివుడన్నా, రాముడన్నా పేర్లమార్పే తప్పయిద్దరూ ఒక్కటే. ఈ సత్యం గ్రహించిన భక్తుడు, యిద్దరి పట్లా సమాన భక్తి ప్రపత్తులు పాటిస్తాడు. మీరు కుడిపక్కనున్న రామాలయానికి ఒక అంకె పెంచారు. పాపం, శివాలయంలో శివుడే పాపం చేశాడు! అటువైపూ ఒక అంకె పెంచడం ధర్మం," అన్నాడు.

చక్రవర్తి మరో 'ఒకటి' ఎడమపక్కగా చేర్చాడు. ఇప్పుడది పదకొండువేల ఒక వరహా అయ్యింది. మంత్రి చెప్పినట్టు శివరామజోషి, ధర్మకర్తగాతగినవాడని చక్రవర్తి చాలా సంతోషించాడు.





కావ్యకథలు :

# రాక్షసముద్రిక-2

వంగరాజ్యం రాయబారి తెచ్చిన సమస్యకు చక్కటి వివరణ తెలియజేయడంతో ప్రజల మధ్య చంద్రగుప్తుడికి గొప్ప పేరు వచ్చింది. ఏనుగు మీద కూర్చోబెట్టి అతణ్ణి ఊరేగింపుగా తీసుకుపోయి ఇంటివద్ద దిగబెట్టారు. నందులు అతణ్ణి మళ్ళీ బంధించడానికి సాహసించ లేకపోయారు.

ఆ కాలఘట్టంలోనే గ్రీకు చక్రవర్తి అలెగ్జాండర్ భారతదేశం మీదికి దండెత్తివచ్చి, ఇక్కడే కొన్నాళ్ళు బస చేశాడు. ఆ సమయంలో చంద్రగుప్తుడు గ్రీకు సైన్యంలో చేరి, యుద్ధ విద్యలలో శిక్షణపొందాడు.






ఒకనాడు చంద్రగుప్తుడు గ్రీకు సేనానాయకుణ్ణి అవమానపరచాడు. గ్రీకు సైనికులు చంద్రగుప్తుణ్ణి బంధించడానికి ప్రయత్నించారు. కాని, చంద్రగుప్తుడు వాళ్ళకు పట్టుబడకుండా తప్పించుకుని సురక్షిత ప్రాంతానికి చేరుకున్నాడు.



ఆదేసమయంలో, మగధరాజభవనంలో ఒక విందు జరిగింది. ఆ విందులో చాణక్యుడని పేరుగాంచిన విష్ణుగుప్తుడనే బ్రాహ్మణుడు అతి సామాన్యంగా కనిపించడంతో, నందులు అతణ్ణి అవమానించి బయటికి గెంటించారు. ఆగ్రహం చెందిన చాణక్యుడు నంద వంశాన్ని నాశనం చేస్తానని శపథం చేశాడు.

చాణక్యుడూ, చంద్రగుప్తుడూ అనుకోకుండా ఒకరినొకరు కలుసుకుని, ఆప్తులయ్యారు. ఇరువురికీ నందులపట్ల ద్వేషం ఉన్నది. చాణక్యుడి బుద్ధికుశలతకు, చంద్రగుప్తుడి ధైర్యసాహసాలు తోడయ్యాయి. ఇరువురూ కలిసి నందులపై పగతీర్చుకోవాలని పట్టుబట్టారు.





ఆ కాలంలో మగధ సరిహద్దు అడవి ప్రాంతాలను పర్వతకుడనే మ్లేచ్ఛరాజు పరిపాలించేవాడు. చాణక్యుడు పర్వతకుణ్ణి కలుసుకుని, తమకు సైనిక సహాయం చేసినట్టయితే, విజయం సాధించాక మగధరాజ్యంలో సగభాగం ఇస్తామని ఆతనికి మాట ఇచ్చాడు. పర్వతకుడు అందుకు అంగీకరించాడు.

చంద్రగుప్తుడు పర్వతకుడి సేనలతో, మగధ మీదికి దండెత్తాడు. యుద్ధం అతి భయంకరంగా జరిగింది. నందుల సైన్యం ఓడిపోయింది. మగధరాజ్యం చంద్రగుప్తుడి వశమయింది.





మంత్రి రాక్షసుడి సహాయంతో, మహానందుడు బిలమార్గం గుండా ఒక రహస్యగృహానికి చేరుకున్నాడు. అయినా, చాణక్యుడి భటులు అతణ్ణి హతమార్చారు. రాజు మరణం రాక్షసుడికి తీరని విషాదం కలిగించింది.

మగధ సింహాసనానికి చంద్రగుప్త మౌర్యుడు పట్టాభిషిక్తుడయ్యాడు. అసమాన ధైర్యశాలీ, వీరుడూ అయిన చంద్రగుప్తుడు తమకు రాజుకావడంతో ప్రజలు పరమానందం చెందారు.





మహానందుడి మరణానికి ఎంతగానో విచారించిన అతనిమంత్రి రాక్షసుడు—చంద్రగుప్తుడిపై పగసాధించాలని ఒక కుట్రపన్నాడు. విషప్రయోగం చేసి, రాజును హతమార్చమని చెప్పి, ఒక సుందరాంగి అయిన విషకన్యను రాజ భవనానికి పంపాడు. అయితే, ఆ విషయం చారులద్వారా చాణక్యుడు ముందుగానే పసిగట్టాడు!

రాజభవనంలో విషకన్య చాణక్యుడికి పట్టుబడిపోయి, తన అపరాధాన్ని క్షమించమని ప్రార్థించింది. చాణక్యుడు ఆమెను చంపలేదు. పైగా, ఆమె తన శక్తియుక్తులను ఉపయోగించి పర్వతకుణ్ణి హతమార్చినట్టయితే, మంచి బహుమతి ఇవ్వగలమని ఆశచూపాడు. పర్వతకుడు మగధలో సగభాగం అడుగుతున్నాడు కాబట్టి, వాణ్ణి ఇలా వదిలించుకోవాలన్నది చాణక్యుడి పథకం.





అదే ప్రకారం విషకన్య పర్వతకుడి భవనం చేరి, తన అందచందాలతో, ఆటపాటలతో అతణ్ణి మురిపించింది. ఒకనాడు అదునుచూసి, మధువుతో విషం అందించి పర్వతకుడి ప్రాణాలు తీసింది! —(ఇంకావుంది)



# ఉత్తమదానం

పద్మనాభుడనే అతనికి, ధర్మవరం గ్రామంలో పెద్ద కిరాణా కొట్టున్నది. అతను ఒకసారి, వ్యాపారం పనిమీద, యలమంచిలి అనే ఊరు వెళ్ళి, తిరిగి తన ఒంటెద్దు బండిమీద ధర్మవరం వస్తున్నాడు.

బండి యలమంచిలి దాటాక, పద్మనాభుడికి, ఒక వ్యక్తి దారిలో కనిపించాడు. అతను పద్మనాభుణ్ణి చూస్తూనే, గబగబా బండిదగ్గిరకు వచ్చి, "మాది దారిలో వున్న పురుషోత్తపురం. నాకు, మీ బండిలో కాస్త చోటిస్తారా?" అని అడిగాడు.

పద్మనాభుడు, ఆవ్యక్తిని యలమంచిలిలోని, ఒక అంగడిలో చూశాడు. ఇద్దరూ, ఆ అంగట్లో జీడిపప్పు కొన్నారు. అతను బండిలో వుంటే కొంత ఊసుపోతుందని ఆలోచించి, పద్మనాభుడు అతణ్ణి బండి ఎక్కమన్నాడు. ఆ వ్యక్తి బండిలో ఎక్కి కూర్చున్నాడు. బండివాడు శరభుడు, బండిని తోలడం ప్రారంభించాడు.

మాటల సందర్భంలో, ఆ వ్యక్తి పేరు రంగరాజు అనీ, పురుషోత్తపురంలో తనకున్న మూడెకరాల మాగాణి భూమి వ్యవసాయం చేసుకుని జీవిస్తున్నాడనీ, పద్మనాభుడు తెలుసుకున్నాడు.

దారిలో కనిపించిన యాచకుల చేతిలో, చిల్లర డబ్బులు వేయసాగాడు పద్మనాభుడు. రంగరాజు మాత్రం, తన దగ్గిర చిల్లరలేదని వాళ్ళను పొమ్మనసాగాడు.

ఇది చూసి పద్మనాభుడు, రంగరాజుతో, "రంగరాజుగారూ! నేను ఎంతో కొంత అడిగినవాళ్ళకు లేదనకుండా ధర్మం చేస్తూంటాను. అవసరం అయితే, మన కోరికలను అదుపులో పెట్టుకుని, ఉన్నదానిలో కొంత దానధర్మాలు

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

చెయ్యాలి. అప్పుడే మనిషికి జన్మసార్థకత!'' అన్నాడు.

ఇంతలో బండిచక్రం సీల జారి కింద పడింది. అది గమనించిన శరభుడు, బండి ఆపి, దాన్ని నెమ్మదిగా దారి పక్కకు లాగించాడు. తర్వాత సీల కదలకుండా దిగవెయ్యడానికి రాయి కోసం వెతుకుతూ దూరంగా వెళ్ళాడు.

పద్మనాభుడూ, రంగరాజూ బండిదిగి, ఒక చెట్టు నీడలో నిలబడ్డారు. అక్కడికి ఒక బక్క చిక్కిన ముసలివాడు వచ్చాడు. వాడి కళ్ళు లోతుకు పోయివున్నాయి. చేతిలో ఒక కర్ర వున్నది.

వాడు ఖరీదైన దుస్తులలో వున్న పద్మనాభుణ్ణి చూసి, ''బాబూ, రెండు రోజులుగా తిండిలేదు. తినడానికేమైనా వుంటే పెట్టించండి,'' అన్నాడు ఎంతో దీనంగా.

వెంటనే పద్మనాభుడు, ''ఈ రహదారిలో తినడానికేం దొరుకుతుంది. దగ్గిరలో పురుషోత్తపురం అనే ఊరు వున్నదికదా! అక్కడికి వెళితే, ఏ పూట కూళ్ళమ్మ యింటనో భోజనం దొరుకుతుంది. డబ్బులిస్తాను, తీసుకుపో,'' అన్నాడు.

ఇది విన్న రంగరాజు, బండిదగ్గిరకు వెళ్ళి, తన సంచీలోంచి జీడిపప్పుల మూట తీసుకుని, చెట్టుదగ్గిరకు తిరిగి వచ్చి, మూటను ముసలివాడికిస్తూ, ''తాతా, యిందులో జీడిపప్పులున్నవి.



ఇవి తిన్నావంటే ఆకలి కొంత తీరుతుంది. తిని, నీళ్ళుతాగు,'' అన్నాడు.

ముసలివాడి కళ్ళు నీళ్ళతో నిండాయి. వాడు, రంగరాజుతో, ''బాబూ, జీడిపప్పు చాలా ఖరీదని విన్నాను. అప్పుడప్పుడూ తినాలన్న కోరికతో, మీరు చాలా ఖర్చుచేసి యింత జీడిపప్పు కొనివుంటారు. వద్దు బాబూ!'' అన్నాడు.

''ఫర్వాలేదు, తాతా! ఆకలితో వున్న నీకు, ఏదో కొంత ఆకలి తీర్చానన్న సంతృప్తి నాకు కలిగించు. కోరికల్ని అదుపులో పెట్టుకుంటేనే, మనిషి జన్మ సార్థకత అని, యీ బాబుగారు యింతకు ముందే నాకు చెప్పారు,'' అని పద్మ నాభుణ్ణి చూపించాడు రంగరాజు.

ముసలివాడు, రంగరాజుకు దణ్ణం పెట్టి, ''బాబూ, నా పళ్ళు యింకా గట్టిగానే వున్నాయి. ఎప్పుడో ఏదో కొద్దిగా యిన్ని జీడి పప్పులు తినడంతప్ప, ఇంత జీడిపప్పు తినడం, నా జన్మలో యింతవరకూ జరగ లేదు,'' అంటూ సంతోషంగా మూటవిప్పి అందులోని జీడిపప్పులు తింటూ వెళ్ళి పోయాడు.

ఆకలితో అలమటిస్తూ వచ్చిన ముసలి వాడి ముఖంలో కనిపించిన సంతోషం చూసి, పద్మనాభుడు ఆలోచనలో పడ్డాడు. తాను చేసే దానధర్మాలకన్నా, రంగరాజు చేసిన దానం ఎంతో ఉత్తమమైనదిగా, ఆయనకు కనిపించింది. రంగరాజు తన కోరికను చంపుకుని, ఆకలిగొన్నవాడి బాధ



తీర్చాడు. కాని, నేనాపని చేయలేక పోయాను. నీతులు చెప్పడం అంటే, వాటిని ఆచరించడం చాలా కష్టం— అని విచారించాడాయన.

అంతవరకూ, తను చాలా తేలిక భావంతో చూస్తున్న రంగరాజు, ఎంతో ఉత్తముడనుకుంటూ, పద్మనాభుడు, అతడితో, "రంగరాజుగారూ, యిది నాకు కొంత ఆశ్చర్యంగా తోస్తున్నది. ఇద్దరం ఒకే దుకాణంలో, ఒకే సమయంలో జీడిపప్పులు కొన్నాం!" అన్నాడు.

అందుకు రంగరాజు చిరునవ్వు నవ్వి, "నా భార్య నిండు గర్భిణి. ఆమె కోరగా జీడిపప్పు కొని తీసుకుపోతున్నాను. అంతే గాని, మామూలుగా జీడిపప్పు కొనేంత తాహతువున్నవాణ్ణి కాదు," అన్నాడు.

తర్వాత రంగరాజు, అక్కడికి సమీపంలో వున్న నూతిదగ్గిరకుపోయి, ముఖం కడుక్కుని, మంచినీళ్ళు తాగి తిరిగి వచ్చాడు. అతడు తిరిగివచ్చేసరికి బండి సిద్ధంగా వున్నది. దారిలోని పురుషోత్తపురంలో బండిదిగి, రంగరాజు ఇంటికి వెళ్ళాడు.

అతడి భార్య, భర్తకు ఎదురు వచ్చి సంచీ అందుకుని, "జీడిపప్పు కొని తెచ్చారా?" అని అడిగింది.

రంగరాజు లేదన్నట్టు తలాడించి, భార్యకు దారిలో జరిగినదంతా చెప్పాడు. ఆమె అంతా విని, "అలాగా!" అంటూ, సంచీలో వున్న యితర పచారీ సరుకుల పొట్లాలు తీసి బయటపెడుతూ ఆశ్చర్యంగా, "అదేమిటండీ, సంచీలో జీడిపప్పు మూట వున్నదిగదా!" అని, మూట భర్తకు చూపింది.

రంగరాజు కూడా ఆశ్చర్యపోయి, ఒకటి, రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, "ఆ పద్మనాభుడు చాలా మంచివాడు. నేనెవరికోసం, ఆ జీడిపప్పు కొన్నానో అడిగి తెలుసుకున్నాడు. తర్వాత, నేను బావిదగ్గిరకు మంచినీళ్ళకోసం పోయి నప్పుడు, తాను కొన్న జీడిపప్పు, నా సంచీలో పెట్టాడు!" అన్నాడు.






ఆ రాత్రి అక్రూరుడు బలరామకృష్ణులతో సహా సుఖమైన భోజనం చేసి, ఒకచోటనే అందరూ పడుకున్నప్పుడు, "నాయనా, తల్లిగర్భం నుంచి బయటపడుతూనే ఇలాటి హీనజీవితంపాలై, ఎన్నో ఘన కార్యాలు చేశావు. ఇంక ఈ జీవితం చాలు. నీ అసలు వంశానికి కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చు. నీ తండ్రి వసుదేవు డెంతో గొప్పవాడు. మీ ఇద్దరిలాటి కొడుకులుండి కూడా, కంసుడికి భయపడుతూ, ఆ దుర్మార్గుడి చేత అవమానాలు పడుతూ, కొడుకులను అడవుల పాలు చేశానే అని మహా కుమిలిపోతున్నాడు. కంసుడు మీ తండ్రిని అనరాని మాటలంటూంటే, మేమందరమూ చేసేదిలేక, తలలు వంచుకుని, కంట తడిపెడతాం. ఇక మీ తల్లి దేవకీదేవి దుఃఖం చెప్పటానికే లేదు. వరసగా ఆమె గర్భాన పుట్టిన బిడ్డలందరినీ కంసుడు చంపేశాడు. అంతమంది పిల్లలను కని కూడా ఆ ఇల్లాలు ఇంతవరకు ఒక్క బిడ్డకు పాలిచ్చి ఎరగదు. ఇంత చక్కని వాడివి, నీముఖం ఎలా ఉంటుందో ఆ తల్లికి తెలుసునా? ఆవిడ మాతృత్వం సఫలం చేసే భారం ఇప్పుడు నీపైన ఉన్నది. నీవంటి కొడుకును పెట్టుకుని ఆవిడ అహర్నిశలు దుఃఖంలో మునిగి తేలుతున్నదంటే, ఇంతకంటె గొడ్రాలితనమే మేలుగదా?" అంటూ అక్రూరుడు కృష్ణుడికి చాలా సేపు హితోపదేశం చేశాడు.

10. బలరామకృష్ణుల మధురాగమనం



ఆయన మాటల సారాంశం కృష్ణుడికి అర్థమయింది. అతను మధురానగరానికి వెళ్ళి, కంసుణ్ణి చంపి, తన తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులకు ఆనందం చేకూర్చాలి.

తెల్లవారింది. అక్రూరుడూ, బలరామకృష్ణులూ కాలకృత్యాలు తీర్చుకుని రథం ఎక్కారు. అక్రూరుడు రథం తోలుతూ వ్రేపల్లె దాటి, మధురకు వెళ్ళే దారి పట్టాడు. కొందరు గోపికలు రథాన్ని కొంత దూరం వెంబడించారు. కృష్ణుడు వెళ్ళి పోవటం వాళ్ళకేమీ బాగాలేదు. కొందరు అక్రూరుణ్ణి బాగా తిట్టుకున్నారు. మరి కొందరు, "రేపు ఏ రాక్షసుడన్నా మన మీద వచ్చిపడితే ఎవరు కాపాడతారు? కృష్ణుణ్ణి వెళ్ళిపోనిస్తున్న మనవాళ్ళు వెర్రివాళ్ళు కారా?" అని అడిగారు. వాళ్ళు కొంతదూరం రథాన్ని వెంబడించి, అతివేగంగా వెళ్ళే రథాన్ని అనుసరించ లేక ఆగి, రథం లేపే దుమ్ము కనబడకుండా పోయేదాకా చూసి, తిరిగి వెళ్ళి పోయారు.

మధ్యాన్నందాకా నడిచి రథం కాళిందీ తీరాన ఒక కదంబవృక్షం నీడలో ఆగింది. అక్రూరుడు బలరామకృష్ణులతో, "నేను నదిలో స్నానంచేసి, అర్ఘ్యం విడిచి, ఇప్పుడే వస్తాను. అంతదాకా మీరు రథంలోనే ఉండండి. ఈ లోపుగా గుర్రాలు గరిక మేస్తాయి," అని చెప్పి, నదిలోకి దిగి, నడుములోతు నీటిలో మునిగాడు.

అలా మునిగిన అక్రూరుడికి నీటిలో రసాతలం కనబడింది. అక్కడ వాసుకీ, కర్కోటకుడూ మొదలైన నాగశ్రేష్ఠులు తిరుగుతున్నారు. చాలా అందంగా నిర్మించిన రత్నమండపం లోపల వెయ్యి తలల ఆదిశేషుడు కనిపించాడు. అతని శరీరం స్వచ్ఛంగానూ, తెల్లగానూ, చుట్టలు చుట్టుకుని ఉన్నది. పడగలు ఎత్తి ఉన్నాయి. అతని నాలుకల వరస మెరుపు తీగలాగా చలిస్తున్నది. అతని పార్శ్వాల రోకలీ, నాగలీ, తాటిచెట్టూ గుర్తులు గల



జెండాలున్నాయి. ఆ శేషుడి చుట్టలపైన కృష్ణుడు నల్లగా, తామర కన్నులతోనూ, పసుపుపచ్చని బట్టలతోనూ కూర్చుని కనిపించాడు.

అలా కనిపించిన కృష్ణుణ్ణి అక్రూరుడు మంత్రాలతో ఆరాధించి, మానసికంగానే వివిధ అర్చనా సామగ్రితో అర్చించాడు. తరవాత అతను నీటిలో నుంచి పైకి లేచి చూసేసరికి, రథంమీదనున్న బలరామ కృష్ణుల దేహాలపైన తన అర్చన తాలూకు గుర్తులు కనిపించాయి. అక్రూరు డది చూసి మరింత అద్భుతపడి, మళ్ళీ నీటిలో మునిగి, తిరిగి ఆదిశేషుణ్ణీ, అతనిపైన కూర్చుని ఉన్న కృష్ణుణ్ణీ చూశాడు.

చివరకు అక్రూరుడు తన అనుష్ఠానాలు ముగించుకుని రథాన్ని చేరరాగానే కృష్ణుడు, "అక్రూరుడా, చాలా ఆలస్యం చేశావు. పాతాళంలో ఏదో చోద్యం కనిపించినట్టున్నదే? నీ ముఖాన ఆశ్చర్యం చూస్తే అలాగే ఉన్నది," అన్నాడు చిరుదరహాసంతో.

"దేవా, నువు దగ్గిరలో ఉండటం కన్న పెద్ద చోద్యం ఇంకేం కావాలి? నువూ, నీ అన్నా ఇక్కడ కనిపించినట్టే నీటిలో కూడా కనిపించారు. నీ వాస్తవ రూపం వర్ణించటం బ్రహ్మకైనా సాధ్యం కాదే, నేనేపాటివాణ్ణి? నాపైన వాత్సల్యం ఉంచి అనుగ్రహించు. మనం ఇంక బయలుదేరాలి. కంసుడు మీ కోసం ఆత్రంగా ఎదురుచూస్తూ ఉంటాడు. సూర్యాస్తమయం లోపల మనం నగరం చేరాలి," అన్నాడు అక్రూరుడు.

కృష్ణుడు నవ్వి, "మేము నీ చేతిలో ఉన్నాం, మా చేతిలో ఏమీ లేదు," అన్నాడు.

రథం తిరిగి బయలుదేరి సాయంకాలం వేళకు మధురానగరం చేరింది. కృష్ణుడు అక్రూరుడితో, "నగరం అనేది ఎట్లా ఉంటుందో ఎన్నడూ చూసినవాళ్ళం కాము. కంసమహారాజును చూసిన దాకా ప్రాణాలాగేటట్టు లేవు. అందుచేత ముందు



గానే నాలుగు వీధులూ చుట్టివస్తాం, అనుమతించు,'' అన్నాడు.

అక్రూరుడు వాళ్ళను రథం దించి, ''మీకు వసుదేవుడి ఇంటికి వెళ్ళాలనిపించవచ్చు. కాని ఆ పని చెయ్యకండి. ముందు తనకు కనపడకుండా వసుదేవుణ్ణి చూస్తే కంసుడికి కోపం వస్తుంది,'' అని చెప్పి, బలరామకృష్ణులను తీసుకొచ్చానని కంసుడితో చెప్పటానికి వేగంగా రథం తోలుకుంటూ వెళ్ళిపోయాడు.

కట్టుతాళ్ళు విప్పిన ఏనుగుల జంటలాగా బలరామకృష్ణులు మధురానగరపు రాజవీధి వెంబడి, నగరపు వింతలను ఆశ్చర్యంగా చూసుకుంటూ, ముందుకు నడవసాగారు. వారలా నడుస్తుంటే అక్కడి పౌరులు వారిని చూసి రకరకాలుగా మాట్లాడుకున్నారు.

కొంతదూరం వెళ్ళేసరికి బలరామకృష్ణులకు రంగకారుడనే రజకుడు కనిపించాడు. అతను రకరకాల బట్టలు మడతలు పెట్టి మూటగట్టి తీసుకుపోతున్నాడు.

''ఏమోయ్, మేం రాజుగారిని చూడబోతున్నాం. రాజసభకు వెళ్ళేవాళ్ళు మంచి మంచి బట్టలు కట్టుకుని మరీ వెళ్ళాలి గద. అందుచేత నీ దగ్గిర ఉన్న బట్టల్లో మంచివి చూసి మాకియ్యి, మంచివాడివి!'' అన్నాడు కృష్ణుడు.

ఆ మాటకు వాడు చాలా కోపించి, ''అడవుల్లో తిరిగే అనాగరికపు మొహాలకు కంసమహారాజు కట్టే బట్టలు కావలిసి వచ్చాయా? ఈ బట్టలంటే ఏమిటనుకున్నారు? ఎక్కడెక్కడి రాజులో కంసమహారాజుకు కానుకగా పంపినవి. పిచ్చిపిచ్చిగా మాట్లాడక, పదండి,'' అన్నాడు.

కృష్ణుడికి కోపం వచ్చింది. అతను కత్తి పెట్టి వాడి మెడ మీద ఒక్కటి పెట్టాడు. తల తెగి కిందపడి వాడు కాస్తా చచ్చాడు. వాడి కెందరో భార్యలున్నారు. వాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చి, జరిగినది చూసి, రాచనగరులో చెప్పుకోవటానికి వెళ్ళారు.

ఈలోపల కృష్ణుడా బట్టలమూట విప్పి, అందులో ఉన్న పసుపురంగు గల బట్టలు తాను తీసుకుని, నీలంరంగు బట్టలు బలరాముడి కిచ్చి, మిగిలిన వాటిలో కొన్నిటిని అక్కడ కనిపించిన వారికి, "భయం లేదు, కట్టుకోండి," అంటూ ఇచ్చాడు. ఆ తరవాత బలరామకృష్ణులు ముందుకు నడిచి కొంతసేపటికి పూల మాలలు కట్టేవాళ్ళుండే వాడ చేరు కున్నారు.

అక్కడ వాళ్ళకు గుణకుడు అనే మాలాకారుడు కనిపించాడు. కృష్ణుడు వాణ్ణి మంచి మంచి పూలడిగాడు. వాడు బలరామకృష్ణులను చూసి ఏ సిద్ధులో, యక్షులో అయి ఉంటారనుకుని, వాళ్ళకు దణ్ణంపెట్టి, "తీసుకోండి. ఈ పూలన్నీ మీవేగా ?" అంటూ మంచి మంచి పూలు ఏరి ఇచ్చాడు. ఆ పూలదండలను వాళ్ళు తలలోనూ, మెడలోనూ, చేతులకూ ధరించి, విచిత్రంగా కనబడ్డారు.

వాళ్ళు రాజవీధి వెంబడి మరికొంత దూరం వెళ్ళేసరికి వారికొక కుబ్జ కనిపించింది. దాని చేతిలో ఒక పాత్ర నిండా మంచి సువాసనలు వెదజల్లే గంధం ఉన్నది. కృష్ణుడామెను సమీపించి, ఆమె ముఖం మీది ముసుగు పైకెత్తి, ముఖంలోకి చూస్తూ, "ఈ గంధం ఎవరి




కోసం తీసుకుపోతున్నావు ?" అని అడిగాడు.

"కంసమహారాజు స్నానం చేసి ఈ గంధం కోసం ఎదురుచూస్తూ ఉంటాడు. నేను తప్ప ఇంకెవరు తయారుచేసినా గంధం ఆయనకు నచ్చదు. దాన్ని నేనే తయారు చెయ్యాలి, ఆయన పూసుకోవాలి. నిన్ను చూడగానే ఏదో మాట్లాడబుద్ధి అయి ఇదంతా చెప్పానుగాని, నేను ఇక్కడ ఒక్కక్షణం ఆగటానికి లేదు. రాజుగారు స్నానం చేసే సమయం!" అన్నది కుబ్జ చాలా హడావుడిగా వెళ్ళబోతూ.

"మేము దేశాంతరం నుంచి వచ్చిన మల్లులం. మీ రాజుగారినీ, రాజ్యాన్నీ,



విల్లుకు జరగబోతున్న గొప్ప ఉత్సవాన్ని చూసి సంతోషింతామని వచ్చాం. నీ గొప్ప నువు చెప్పుతున్నావనుకో, మేము ఊరికే నిన్ను ఎలా మెచ్చుకోం? ఆ పాత్రలో ఉన్న గంధం ఇచ్చావంటే, మేము పూసుకుని, నిన్ను మనసారా మెచ్చుకుని హాయిగా వెళ్ళి రాజుగారి దర్బారులో కాస్త కళగా కూర్చుంటాం," అన్నాడు కృష్ణుడు చిన్నగా నవ్వుతూ.

ఆ మాటకు కుబ్జ నవ్వి, "సరే తీసుకోండి," అంటూ తన పాత్రలోని గంధం ఇచ్చేసింది.

కృష్ణుడు ఆ గంధాన్ని ముందు బలరాముడి కిచ్చి, తనకు కావలసినది తాను కూడా పూసుకుని, మిగిలినది అక్కడ ఉన్న పిల్లల కిచ్చేశాడు. అతనికి ఆ కుబ్జను మామూలు మనిషి చెయ్యాలని పించింది. అందుకని అతను, ఆ కుబ్జ కాలివేళ్ళను తన కాలివేళ్ళతో నొక్కిపట్టి, చూపుడు వేలుతో ఆమె ముఖం పైకెత్తాడు. వెంటనే ఆమె రూపు మారి పోయి, ఆమె శరీరం వంకలు తీరింది. సన్నని నడుమూ, చదునైన వీపూ, దీర్ఘమైన దేహమూ ఏర్పడ్డాయి. ఆమె తనను తాను చూసుకుని అద్భుతమూ, ఆనందమూ పొంది, నవ్వుతూ కృష్ణుణ్ణి చూసి, "నా కెంతో మహోపకారం చేసిన మహానుభావుడవు, మా యింటికి వచ్చి నన్ను ధన్యురాలిని చెయ్యి. నీ దారిన నువు పోతానంటే ఊరుకోను," అన్నది, అతని చేతిని తన చేత్తో పట్టుకుని ఎంతో ఆప్యాయంగా.

"నా కిప్పుడు బోలెడంత పని ఉన్నది. మళ్ళీ వస్తాను. నువు నా దానివే ననుకో," అంటూ కృష్ణుడు మంచిగా ఆమె చెయ్యి విడిపించుకుని, బలరాముడితో సహా ముందుకు సాగాడు. వాళ్ళిద్దరూ తమ ఉద్దేశాలనూ, బింకాన్నీ పైకి కనబడనీయక, మామూలు గోపకులలాగానే ప్రవర్తించుతూ, నెమ్మదిగా నడుచుకుంటూ కంసుడి మందిర ద్వారాన్ని

చేరుకున్నారు. అక్కడ చాలా కోలాహలంగా ఉన్నది. కంసుడికి ఎందరెందరో రాజులు పంపిన కానుకలు, ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ, సుందర వస్తువులూ వేలసంఖ్యలో ఎడతెగకుండా వచ్చి చేరుతున్నాయి.

లోపల ఆయుధాగారం ఉన్నది. దాన్ని బంగారంతోను, పెద్దపెద్ద మణులతోనూ చాలా అందంగా నిర్మించారు. అనేక మంది రాజులు దాన్ని చూడవచ్చారు. అసంఖ్యాకులైన భటులు దానికి రక్షగా ఉన్నారు.

''కంసమహారాజుగారి విల్లు ఇక్కడేనా ఉండేది? దాన్ని చూద్దామని చాలా దూరం నుంచి కుతూహలంతో వచ్చాం. ఏదీ? దానిని చూడవచ్చునా?'' అని బలరామకృష్ణులు అమాయికంగా అనేసరికి, ఆయుధాగారం రక్షకభటులు వాళ్ళను విల్లున్న చోటికి తీసుకుపోయారు. అది బ్రహ్మాండమైన విల్లు; తక్షకుడి శరీరంలాగున్నది.

దాన్ని చూసి కృష్ణుడు, ''దీన్ని ఎక్కుపెట్టటం దేవతలకూ, దానవులకూ కూడా సాధ్యం కాదంటారే. నిజం ఏమిటో చూస్తాం,'' అంటూ ఆ విల్లును ఒక్కచేత అవలీలగా ఎత్తి, చులాగ్గా నారి సంధించి మీటాడు. అది చేసిన మోత భయంకరంగా అన్ని దిక్కులా ప్రతిధ్వనించింది. అక్కడ ఉన్నవారంతా నిర్ఘాంతపోయి చూస్తూండగా, కృష్ణుడు ఆ వింటిని తన పిడికిట పట్టి పెళుక్కున విరిచేశాడు. గొప్ప ఉత్సవం చేసుకోనున్న ఆ విల్లు కాస్తా ముక్కలు ముక్కలయింది. కృష్ణుడు తన కేమీ తెలియనట్టు చల్లగా జనంలో కలిసిపోయి ఆయుధాగారం నుంచి బయట పడ్డాడు.

ఆయుధాగారాన్ని రక్షించే భటులు భయపడిపోయి, ఒకరికన్న ఒకరు ముందు పరిగెత్తి కంసుడి అంతఃపురానికి వెళ్ళి, జీరపోయిన గొంతులతో, ఆయుధాగారంలో జరిగిన సంగతంతా కంసుడికి నివేదించారు.





# తోడేలురూపు

బ్రిటనీలోని ఒక దుర్గంలో ఒక సామంతుడుండేవాడు. ఇతను యువకుడు, రాజుకు అభిమానపాత్రుడు. ఇతని భార్య అందగత్తె, మహాసాధ్వి లాగా కనబడేది. అలాగే ప్రవర్తించేది. కాని నిజానికి ఈమె స్వభావం మంచిది కాదు. ఆమె మరొక సామంతును ప్రేమించి, వీలయితే అతడికి భార్య అయేందుకు తహతహ లాడుతూండేది.

ఆమె తన భర్తను గురించి ఒక విషయం గమనించింది. అతను వారానికి మూడు రోజులు ఎటో వెళ్ళి తిరిగి వచ్చేవాడు. ఇందులో ఏదో రహస్యం ఉన్నదనీ, అది తనకు తెలిసినట్టయితే ఏదో ఒక విధంగా లాభించవచ్చుననీ ఆమె అనుకున్నది. అందుచేత ఆమె ఒకనాడు తన భర్తతో, "ఏమండీ, మీరు వారానికి మూడు రోజులు నన్ను ఒంటిగా విడిచి ఎటో వెళ్ళిపోతున్నారు. ఇందువల్ల నా కెంత బాధో ఆలోచించారా?" అన్నది.

"నేనేం చేసేది? తప్పనిసరి అయి వెళుతున్నాను. బుద్ధి పూర్వకంగా నిన్ను విడిచి ఒక క్షణం ఉండగలనా?" అన్నాడు భర్త.

"అంత తప్పనిసరి ఏమి వచ్చింది? నాకు కాస్త చెప్ప గూడదా?" అన్నది భార్య ఎంతో ఆప్యాయత కనబరుస్తూ. ఆమె చాలా నిర్బంధించిన మీదట, రహస్యం ఎవరికీ చెప్పనని ఆమె చేత ప్రమాణం చేయించుకుని ఆ సామంతు, "నేను వారానికి మూడు రోజులు విధిగా తోడేలు రూపు ధరించి, అరణ్యంలో సంచరిస్తాను. ఇది నాకు చుట్టుకున్న ప్రారబ్ధం," అని చెప్పాడు.

"ఈ మార్పు ఎలా జరుగుతుందీ?" అని భార్య అడిగింది.

ఫ్రెంచి జానపద గాథ



ఈ మాట విని ఆ దుర్మార్గురాలు తనలో చాలా సంతోషించింది. ఆ దుస్తులు దాచే రహస్యస్థలం చెప్పమని బతిమాలటం మానలేదు. ఆమెకు తనపై అంతులేని ప్రేమ అన్న గట్టి నమ్మకంతో అతను చివరకు తాను దుస్తులు దాచే స్థలం వివరాలు చెప్పేశాడు: ''అడవిలో ఒక పాడుబడిన ఆలయం ఉన్నది. దాని పక్కనే పొదల మధ్య రాతిలో ఒక అదృశ్యంగా ఉండే తొర్ర ఉన్నది. ఆ తొర్రలో నా దుస్తులు దాస్తాను.''

ఈ రహస్యం తెలియటంతో ఆమెకు తన భర్తను వదిలించుకునే ఉపాయం తెలిసిపోయింది. ఈసారి అతను అడవికి వెళ్ళిపోగానే ఆమె తన ప్రియుడికి కబురు చేసి అతనికి తన భర్త రహస్యమంతా చెప్పేసింది. ఆమె కోరికపై అతను అడవిలోని ఆలయం వద్దకు వెళ్ళి, ఆమె భర్త దుస్తులు తెచ్చి ఆమె కిచ్చేశాడు. ఆమె వాటిని ఒక భోషాణంలో దాచేసింది.

తోడేలు రూపంలో ఉన్న సామంతు మూడు రోజులపాటు అరణ్యంలో తిరిగి తన దుస్తుల కోసం వచ్చి చూస్తే అవి లేవు. తన భార్య తనకు ద్రోహం చేసిందని అతనికి అర్థమయింది గాని, దానికి ప్రతిక్రియ చేసే అవకాశం అతనికి లేదు. ఎందుకంటే, అతను ఈ తోడేలు రూపంతో

''అరణ్యంలోకి వెళ్ళి, నా దుస్తులన్నీ తీసి ఒక చోట గుర్తుగా పెట్టేస్తాను. వెంటనే నాకు తోడేలు రూపు వస్తుంది. మూడు రోజులూ తోడేలుగా జీవించాక నా దుస్తులు తిరిగి ధరించగానే మనిషి రూపు వచ్చేస్తుంది,'' అన్నాడు భర్త.

''అయితే ఆ దుస్తులు ఎక్కడ దాస్తా రేమిటి?'' అని భార్య అమాయికంగా అడిగినట్టు అడిగింది.

''అది పరమ రహస్యం. ఇంకొకరికి చెప్పేది కాదు. ఎందుకంటే ఆ దుస్తులు నాకు తిరిగి దొరకక పోయాయో నేను తోడేలు రూపుతో ఉండి పోవలసినవాణ్ణే!'' అన్నాడు భర్త.

అడవిదాటి వెళితే కుక్కలూ, మనుషులూ అతని ప్రాణాలు తీయవచ్చు.

కొన్ని వారాలపాటు అతని భార్య భర్త కోసం దొంగ కన్నీరు కార్చి చివరకు తన ప్రియుణ్ణి పెళ్ళాడి, తన యుక్తి పారినందుకు ఎంతో సంతోషించింది.

ఒక సంవత్సరంపాటు సామంతు, తోడేలురూపంలో అరణ్యమంతటా తిరుగుతూ, కనబడిన ప్రాణినల్లా చంపి తింటూ అచ్చుగా తోడేలు లాగే జీవించాడు.

ఆ తరవాత రాజుగారు ఒక రోజున ఆ అరణ్యానికి వేటకు వచ్చాడు. ఆయన వెంట ఉన్న వేటకుక్కలు తోడేలు వాసన పసికట్టి, మొరుగుతూ దాని కోసం వేటాడ సాగాయి. రాజూ, ఆయన వెంట ఉన్న వేటగాళ్ళూ కుక్కల వెనకగా గుర్రాల మీద పరిగెత్తారు.

తోడేలు వేటకుక్కలకు అందకుండా ఎన్నో గంటలసేపు పరిగెత్తింది. సాయంకాలం అయేసరికి దాని పని అయిపోయింది. చావుకు సిద్ధపడి ఆ తోడేలు ఒక చోట నిలిచిపోయింది. ఇంతలో కుక్కలూ, వాటి వెనకగా మనుషులూ తనను సమీపించటం దానికి కనబడింది. తనపై ఎంతో అభిమానం గల రాజును అది గుర్తించింది. మరుక్షణమే అది రాజును సమీపించి, ఒక పాదం ఎత్తి రికాబు మీద



ఉంచి, మోరచాచి రాజుగారి పాదం మీద ఆనించింది.

ఈ విచిత్రమైన చర్య చూసి రాజు నిర్ఘాంతపోయి, "ఏమిటిది? ఈ తోడేలు నన్ను శరణు వేడుతోంది. వేట కుక్కలను పట్టుకోండి. ఈ తోడేలును అరణ్యంలో విడిచిపుచ్చుదాం," అన్నాడు.

రాజు తోడేలును విడిచినా, తోడేలు రాజును విడవలేదు. ఇంటికి తిరిగి పోయే రాజుగారి గుర్రం పక్కనే నడవసాగింది.

రాజభవనం దాకా వచ్చిన తోడేలును చూసి రాజు, "దీనికి నా రక్షణ కావాలి లాగుంది. అలాగే ఇస్తాను. దీనికి రోజూ మాంసం పెట్టి జాగ్రత్తగా పోషించండి.



ఎవరుగాని దీనికి ఎలాటి హానీ చేయవద్దు," అని ఆజ్ఞాపించాడు.

అదిమొదలు ఆ తోడేలు రాజప్రాంగణంలో ఉంటూ, పెంపుడు కుక్క లాగా అస్తమానం రాజుగారి వెనకే తిరుగుతూ ఉండేది. ఎవరిజోలికీ పోక ఎంతో సాధువు లాగా ఉండేది. పగలల్లా అది రాజుగారిని అంటిపెట్టుకుని ఉండి, రాత్రివేళ ఆయన మంచం పక్కనే పడుకునేది.

క్రమంగా రాజుగారికి తన వేట కుక్కల మీదే కన్న కూడా ఈ తోడేలు మీద హెచ్చుమమకారం ఏర్పడింది.

ఇది జరిగిన కొద్ది రోజులకే రాజుగారు రాచకార్యం ఒకటి వచ్చి తన సామంతులనందరినీ రాజభవనంలో హాజరు కమ్మని ఆజ్ఞాపించాడు. ఈ సామంతులలో తోడేలు రూపు ధరించినవాడి దుస్తులు కాజేసి, అతని భార్యను పెళ్ళాడిన వాడు కూడా ఉన్నాడు. అతణ్ణి చూడగానే తోడేలు కోపంతో గుర్రుపెట్టి, అతడి మీదికి లంఘించి కింద పడేసింది. అది అతని పీక కొరికే లోపుగా ఇతరులు వచ్చి తోడేలును లాగేశారు. ఆ రోజు ఇదే సంఘటన మూడుసార్లు జరిగింది. ఇది చూసి రాజుగారు ఆశ్చర్యపడ్డాడు. అది ఎవరి జోలికీ ఎన్నడూ పోదు. అలాటిది ఈ ఒక్క సామంతు పైన ఎందుకు మూడుసార్లు పడింది? ఈ సందేహం ఇలా ఉండగా రాజుకు మరొక భయం కూడా పట్టుకుంది; తోడేలు తన సామంతును చంపవచ్చు, ఇతరులు తోడేలును చంపవచ్చు; ఇందులో ఏది జరగటమూ ఆయన కిష్టం లేదు. అందుచేత ఆయన తన సామంతులందరూ వెళ్ళిపోయినదాకా తోడేలును గొలుసు పెట్టి కట్టేయించాడు.

ఇది జరిగిన కొంతకాలానికి రాజుగారు అదే అరణ్యానికి వేటకు వెళ్ళి అరణ్యం మొదట్లో ఉన్న విశ్రాంతి గృహంలో విడిది చేశాడు. ఈ విశ్రాంతి గృహం తోడేలు రూపంలో ఉన్న సామంతుదే. రాజుగారు

వచ్చినట్టు తెలిసి ఆ సామంతు పూర్వ భార్య, రాజుగారిని మెప్పించి, తన రెండో భర్తకు లాభం కలిగించాలనే ఉద్దేశంతో నౌకర్ల చేత కానుకలు మోయించుకుని, రాజుగారున్న బసకు వచ్చింది.

ఆమె రాజుగారి సమక్షంలోకి వచ్చిన మరుక్షణమే రాజుగారి చెంతనే ఉన్న తోడేలు ఆమె పైకి లంఘించి గొంతు కొరకబోయింది. ఆమె కెవ్వున అరిచింది. అక్కడ ఉన్న వారంతా కత్తులు దూసి తోడేలును చంపబోయారు. రాజుగారు వారిని నివారించకపోతే తోడేలు ఆ క్షణంలో చచ్చి ఉండేదే!

రాజుగారు తోడేలుకు ఏ అపాయమూ రాకుండా తన చేతులతో పొదివి పట్టుకుని, "ఈమె పూర్వ భర్త నా మిత్రుడు. అతను ఏమయాడో, ఎటు వెళ్ళిపోయాడో ఎవరికీ తెలియదు. ఈమె రెండో భర్త అతని భార్యనూ అతని ఆస్తినీ సొంతం చేసుకున్నాడు. ఎవరికీ అపకారం చెయ్యని ఈ తోడేలు వీరిద్దరినీ చూసి ఆగ్రహం చూపింది. ముందు ఈ భార్యాభర్తలను తీసుకుపోయి చీకటికొట్టులో బంధించండి. తరవాత నిలకడ మీద నిజమేమిటో తేలుతుంది," అన్నాడు.

సామంతు భార్య కొద్ది రోజులు చీకటి కొట్టు అనుభవించాక రాజుగారి దగ్గిర జరిగినదంతా చెప్పి తన నేరం ఒప్పుకున్నది.

రాజుగారు భోషాణంలో ఉండిన సామంతు దుస్తులు తెప్పించి, వాటినీ తోడేలునూ ఒక గదిలో ఉంచాడు. కొంత సేపయాక సామంతుడు తన మానవ రూపుతో ప్రత్యక్షమయాడు.

రాజుగారు అతని దుష్ట భార్యకూ ఆమెను పెళ్ళాడిన వాడికీ దేశబహిష్కార శిక్ష విధించి తన మిత్రుడికి అతని ఆస్తి ఇప్పించేశాడు. అయితే అతను తన దుర్గంలో ఉండక ఎప్పుడూ రాజభవనంలో ఉంటూ, వారానికి నాలుగు రోజులు మనిషిగానూ, మూడు రోజులు తోడేలుగానూ రాజుగారి సాన్నిధ్యం వదలకుండా జీవించాడు.






# గొడ్డలిపదును

దేవగిరిరాజ్యాన్ని, ఒకప్పుడు విక్రమసింహుడనే రాజు పాలించేవాడు. ఆయన కొలువులో యుగంధరుడనే మంత్రి, శశివర్మ అనే సేనాధిపతి వుండేవాళ్ళు. ఒకడు మహామేధావి అయితే, మరొకరు అపరపరాక్రమశాలి. వారి కారణంగా దేవగిరిరాజ్యం శత్రువులకు దుర్భేద్యంగా, సుఖశాంతులతో అలరారుతూండేది.

ఇలా వుండగా, ఒకనాడు సేనాధిపతి శశివర్మ హృద్రోగానికి గురై అకాలమరణం పాలయ్యాడు. శశివర్మ స్థానంలో సేనాధిపతిగా ఎవరిని నియమించాలన్నది పెద్ద సమస్య అయింది.

మంత్రి యుగంధరుడితో సమాలోచించి, సైన్యాధిపతి పదవికి తగిన యోధులకోసం రాజ్యంలో చాటింపు వేయించాడు, రాజు విక్రమసింహుడు. అది విని రాజ్యంలోని అనేకమంది యుద్ధవిద్యలు నేర్చిన యువకులు ముందుకు వచ్చారు.

వాళ్ళందరికీ గుర్రపుస్వారీ, కత్తియుద్ధం వంటి ఎన్నో అంశాలలో పోటీలు నిర్వహించబడ్డాయి. ఓడిపోయిన వారుపోగా, నిశాంతుడు, నిఖిలుడు అనే ఇరువురు మాత్రం అన్ని పోటీలలోనూ సమఉజ్జీలుగా నెగ్గారు. వారిరువురి శక్తిసామర్థ్యాలూ, ఒకే విధంగా వున్నాయి. ఆ ఇద్దరిలో సైన్యాధిపతి పదవికి ఎవరిని ఎంపికచేయాలో, విక్రమసింహుడికి అంతుపట్టలేదు.

ఆయన, మంత్రి యుగంధరుడి సలహా మీద ఒక విలువిద్యా ప్రదర్శన ఏర్పాటు చేశాడు. రెండు మద్దిచెట్ల చిటారు కొమ్మల్లో, రెండు లక్ష్యాలను అమర్చాడు. వాటి ప్రతిబింబాలను కిందనున్న అద్దాల్లో చూస్తూ, వాటిని బాణాలతో పడగొట్టాలి.

ప్రభాకర్ మందార



ఆదేశం అందుకున్న రెండు, మూడు క్షణాల్లోనే నిఖిలుడు అతి సునాయాసంగా లక్ష్యాన్ని నేలకూల్చాడు. నిశాంతుడు మాత్రం అద్దంలో లక్ష్యాన్ని చూస్తూ, సరి అయిన కోణం కోసం, అటూ యిటూ కదిలి కొంత ఆలస్యంగా ఛేదించాడు.

"నిఖిలుడే సేనాధిపతి పదవికి అర్హుడు!" అన్నాడు విక్రమసింహుడు.

"క్షమించండి, మహారాజా! మీ అభిప్రాయంతో నేను ఏకీభవించలేను." అన్నాడు యుగంధరుడు సవినయంగా.

"అదేమిటి, మహామంత్రీ! ఆదేశించిన మరుక్షణమే, లక్ష్యాన్ని ఛేదించాడు, నిఖిలుడు. కాని, నిశాంతుడు అటూ యిటూ తచ్చాడి తచ్చాడి, ఆలస్యంగా లక్ష్యాన్ని పడగొట్టాడు. మరి, నిశాంతుడి కంటే నిఖిలుడే సమర్థుడని నిర్ణయించడంలో సందేహపడవలసినదేమున్నది?" అని ప్రశ్నించాడు విక్రమసింహుడు.

అందుకు మంత్రి, "మహారాజా, నిశాంతుడు లక్ష్యాన్ని పడగొట్టడంలో కొంత ఆలస్యం చేయడం, అతడి సామర్థ్య లోపంగా భావించకూడదు. లక్ష్యాన్ని తప్ప అనవసరంగా ఒక్క ఆకును కూడా రాల్చకూడదన్న ఉద్దేశంతోనే, అతడు కొంత తాత్సారం చేశాడు. సరిగ్గా అనుకున్న విధంగా లక్ష్యాన్ని పడగొట్టాడు. కాని, నిఖిలుడి బాణం దెబ్బకు లక్ష్యంతోపాటు, ఆకులూ, రెమ్మలే కాదు—ఒక కొమ్మ కూడా నేలకూలింది. కనుక నిఖిలుడి కంటే నిశాంతుడే యోగ్యుడు, సమర్థుడు!" అని వివరించాడు యుగంధరుడు.

రాజు విక్రమసింహుడు పునరాలోచన చేశాడు. మంత్రి చెప్పింది ఆయనకు వాస్తవంగా తోచింది.

మంత్రి, రాజుతో, "మహారాజా, మీరు అనుమతిస్తే, మరొక చిన్న పోటీ ఏర్పాటు చేస్తాను. అందులో బుద్ధిబలం, భుజబలం సమపాళ్ళలో వున్న నిశాంతుడే సేనాధిపతి పదవికి అర్హుడని మీరే నిర్ణయించగలరు," అన్నాడు.

ఇందుకు విక్రమసింహుడు, తన అంగీకారం తెలిపాడు.

యుగంధరుడు వెంటనే రెండు గొడ్డళ్ళను తెప్పించాడు. నిశాంతుడికి, నిఖిలుడికి చెరొకటి యిస్తూ, ఎదురుగా వున్న రెండు మద్దిచెట్లను నరకమని ఆదేశించాడు. చెట్టును ఎవరు ముందుగా నరుకుతారో, వారే సేనాధిపతి అని యిద్దరికీ చెప్పాడు.

నిఖిలుడు, గొడ్డలి అందుకున్న మరుక్షణమే ఉత్సాహం ఉరకలు వేస్తూండగా వెళ్ళి, చెట్టును నరకడం ప్రారంభించాడు. నిశాంతుడు మాత్రం గొడ్డలిని అందుకుని, ఒకసారి దాని వంక పరీక్షగా చూశాడు. అది అంత పదునుగా లేకపోవడం గమనించి, దగ్గరలో కనిపించిన ఒక రాతి మీద దానికి పదునుపెట్టడంలో లీనమైపోయాడు.

ఆ విధంగా రెండు గంటలకాలం గడిచింది. నిఖిలుడు అప్పటికే తన చెట్టు మొదలును చాలా భాగం నరికేశాడు. నిశాంతుడు మాత్రం యింకా తన గొడ్డలికి పదును పెడుతూనే వున్నాడు.

రాజు విక్రమసింహుడు, వాళ్ళవంక ఆశ్చర్యంగా చూడసాగాడు. యుగంధరుడు నిశాంతుడి వంక మెచ్చుకోలుగా చూడసాగాడు.

నిశాంతుడు మరి కొంతసేపటికి, బాగా పదునెక్కిన తన గొడ్డలి కేసి తృప్తిగా చూసుకుని, తన చెట్టును నరకడం మొదలు పెట్టాడు. అసరికే నిఖిలుడి భుజాల్లో శక్తి పూర్తిగా క్షీణించిపోయింది. అతడి గొడ్డలిదెబ్బలకు చెట్టు తెగడంలేదు.

నిశాంతుడు మాత్రం పెద్దగా అలిసిపోకుండానే, చకచకా తన చెట్టును పూర్తిగా నరికి పడగొట్టాడు. అది చూసి నిఖిలుడు, సగం తెగిన తన చెట్టు మొదలు వద్ద నిస్సత్తువుగా కూలబడిపోయాడు.

రాజు అపరిమితానందంతో మంత్రి యుగంధరుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. అప్పటికప్పుడే నిశాంతుడు దేవగిరి రాజ్య సేనాధిపతిగా నియమించబడ్డాడు.





# ఇల్లుపట్టిన భూతం

ఒక ఊళ్ళో మల్లయ్యా అనే గాజుల వర్తకుడుండేవాడు. అతను ఊరిచివరని పెద్ద స్థలంలో చిన్న పూరి యిల్లు కట్టుకుని, అందులో తన భార్యా బిడ్డలతో కాపరం ఉండేవాడు. ఈ స్థలమూ, ఇల్లూ కాక గాజుల మల్లయ్యకు గల అస్తి ఒక ఆవూ, దూడా, కోళ్ళూనూ.

మల్లయ్య రోజూ ఉదయాన్నే లేచి, ఆవుకు పాలు తీసి, గడ్డి వేసి, చద్ది అన్నం తిని, మధ్యాన్నానికి అన్నం మూట గట్టుకుని గాజుల బేరం మీద బయలుదేరేవాడు. సాయంకాలం దాకా ఆ పల్లే ఈ పల్లే తిరిగి, చీకటిపడి ఇంటికి చేరుకునేవాడు.

ఒక రోజు గాజుల మల్లయ్య ఒక మర్రిచెట్టు దగ్గిరికి చేరేసరికి మధ్యాన్నమయింది. దగ్గిరలోనే బావి కూడా ఉన్నది. మల్లయ్య తన మలారం చెట్టు కింద దింపుకుని, చెంబుతో నీళ్ళు తెచ్చుకుని, తన అన్నం మూట విప్పి, తిన్నంత తిని, మిగతాది ఏ కుక్కలో తినేస్తాయి గదా అని చెట్టుకిందనే వదిలేసి, మలారం భుజాని కెత్తుకుని ముందుకు సాగిపోయాడు.

మల్లయ్య కదిలాడో లేదో ఒక బ్రహ్మరాక్షసి అటుగా వచ్చింది. అది లోగడ ఉంటూ వచ్చిన చెట్టు పడిపోవటం చేత, కొత్త నివాసం ఏర్పాటు చేసుకునేటందుకు అది ఈ మర్రిచెట్టును చూసి వచ్చింది. దానికి గాజుల మల్లయ్య వదిలిపెట్టిన అన్నం కనిపించింది. బాగా ఆకలిగా ఉండటాన అది ఆ అన్నమూ, పచ్చళ్ళూ ఆవురావురు మంటూ తినేసింది.

అంతవరకూ బ్రహ్మరాక్షసి పచ్చి మాంసమూ, పచ్చినెత్తురూ తప్ప రుచి చూడ లేదు. ఇప్పుడు దానికి మనుషులు



తినే ఆహారం ఎంత రుచిగా ఉంటుందో తెలిసి వచ్చింది. ఇలాటి తిండే తింటూ మనిషిలాగా బతకాలన్న బలమైన కోరిక దానికి కలిగింది. గాజుల మల్లయ్య కోసం ఎదురుచూస్తూ అది అక్కడే ఉండి పోయింది.

ఆ రోజుకు బేరం ముగించుకుని మల్లయ్య ఆ దారినే తిరిగి వస్తూ, మర్రి చెట్టు దగ్గిర మలారం దించి బావి దగ్గిర మంచి నీళ్ళు తాగుతూ ఉండగా ఎవరో ఆడకూతురు ఏడుస్తున్న ధ్వని వినిపించింది. మల్లయ్య తల తిప్పి చూసే సరికి చెట్టు మొదట ఒక ఆడ మనిషి కూచుని ఏడుస్తూ ఉండటం కనపడింది.

"ఎవరమ్మా నువ్వూ? ఇక్కడ ఒంటరిగా ఏడుస్తున్నా వెందుకు?" అని మల్లయ్య అడిగాడు.

"మాది చాలా దూరం, బాబూ! నా భర్త ఎటో వెళ్ళిపోయాడు. తిండీతిప్పలూ లేక బాధ పడుతున్నాను," అన్నదా స్త్రీ.

"అయ్యో, పాపం! మా ఇంటికి వచ్చి పని సహాయంగా ఉండు. జీతం ఏమీ ఇవ్వలేను గాని, కడుపునిండా తిండి పెడతాను. నీ భర్త జాడ తెలిస్తే వెళ్ళిపోదువు గాని," అన్నాడు మల్లయ్య.

బ్రహ్మరాక్షసికి కావలిసింది కూడా అదే గనక, "బాబూ, నా చేతనైన పని ఏదన్నా చెప్పి చేయించుకోండి. చేతగాని పని చెబితే మాత్రం నేను మీ ఇంట ఒక్క క్షణం ఉండను. ఎందుకైనా మంచిది, ముందే చెబుతున్నాను," అన్నది.

సరేనని మల్లయ్య ఆడమనిషి రూపంలో ఉన్న ఆ బ్రహ్మరాక్షసిని తన వెంట తీసు కెళ్ళాడు. అతని భార్య ఆ మనిషి వృత్తాంత మంతా భర్త నుంచి విని, "నీ పేరే మమ్మా?" అని అడిగింది.

"నా పేరు దయ్యమ్మ," అన్నది బ్రహ్మరాక్షసి తడుముకోకుండా.

సరే మర్నాటి నుంచి దయ్యమ్మ మల్లయ్య ఇంట పని ప్రారంభించింది. పొద్దున్నే లేచి వాకిళ్ళు ఊడ్చి, నీళ్ళు

చల్లేది. మల్లయ్య పాలు తీయగానే ఆవునూ, దూడనూ తీసుకుపోయి మధ్యాన్నం దాకా మేపు కొచ్చేది. మిగిలిన రోజల్లా మల్లయ్య భార్యకు అన్ని పనుల లోనూ సహాయం చేసేది.

ఒకనాటి రాత్రి మల్లయ్య చాలా పొద్దు పోయి ఇంటికి వచ్చి తలుపు తట్టాడు. అప్పటికే ఇంటిల్లిపాదీ అన్నాలు తిని, చలికి ముసుగులు తన్ని పడుకున్నారు. మల్లయ్య భార్య మంచం మీద పడు కున్నది. దయ్యమ్మ నేల మీద చాప వేసుకుని పడుకుంది.



మల్లయ్య భార్య ముసుగులో నుంచి బయటికి రావటం ఇష్టంలేక, "ఆయన వచ్చినట్టుంది. కాస్త తలుపు తియ్యి, దయ్యమ్మా!" అన్నది.

దయ్యమ్మ ఒక్క మూలుగు మూలిగి, చాప మీద పడుకుని ఉండే, చెయ్యి పొడుగుచాచి తలుపు గడియ తీసింది. ఇది కాస్తా మల్లయ్య భార్య కంట పడింది. ఆమె పైప్రాణాలు పైనే పోయినంత పని అయింది. ఆమె తన భయాన్ని ఎలాగో అణచుకుని, మర్నాటి ఉదయం రాత్రి జరిగిన విడ్డూరం గురించి తన భర్తతో చెప్పేసి, "ఇది మనిషి కాదు. దాని పేరే విడ్డూరం! దయ్యమ్మ అని ఎవరన్నా పేరు పెట్టుకుంటారా?" అన్నది.

మల్లయ్య తన భార్య మాటలు మొదట నమ్మలేదు. కాని, తనకు కూడా లోపల అనుమానంగానే ఉన్నది. తాను లోపలికి వచ్చేసరికి దయ్యమ్మ చాప మీద పడుకునే ఉన్నది. తలుపు గడియ తీసి వెళ్ళి పడు కోవటానికి తగిన వ్యవధిలేదు. దయ్యమ్మ మనిషి అయినా కాకపోయినా తన భార్య భయపడుతున్నది గనక ఆమెను పంపెయ్యాలనే మల్లయ్య నిశ్చయించాడు. కాని అకారణంగా వెళ్ళిపొమ్మంటే మర్యాదగా ఉండదు, చేతగాని పని చెబితే పోతానని దయ్యమ్మ మొదటనే చెప్పింది. అందుచేత ఆమెను పంపటానికి మల్లయ్య ఒక ఎత్తు ఎత్తాడు.

ఆయన దయ్యమ్మతో, "చూడు, దయ్యమ్మా, మన ఇంటి చుట్టూ బోలెడంత ఆవరణ ఉన్నది. ఇందులో ఎన్నో చెట్లు వేసుకోవచ్చు. అయితే ముందుగా నిలువెత్తున ప్రహరీగోడ కట్టాలి. కాస్త ఆ పని చూడు!" అన్నాడు.

దయ్యమ్మ అంత పని తనవల్ల కాదనక, సరేనని తానే మట్టి తవ్వి, ఇటుకలు చేసి కాల్చి, ఒంటరిగా ఆవరణ చుట్టూ ఎత్తయిన ప్రహరీగోడ కట్టేసింది. ఆ తరవాత ఎక్కడెక్కడి నుంచో పెద్ద పెద్ద చెట్లు తెచ్చి ఆవరణ అంతటా పాతి తోట తయారు చేసింది.

దయ్యమ్మ మామూలు మనిషి కాదని మల్లయ్యకు రూఢి కావటమేగాక ఊళ్ళో వాళ్ళందరికీ కూడా తెలిసిపోయింది. ఈ దయ్యమ్మను ఎలా వదుల్చుకోవాలో మల్లయ్యకు పాలుబోలేదు. దయ్యమ్మ ఎవరికీ ఏ అపకారమూ చెయ్యటం లేదు, నిజమే. కాని అటువంటి మనిషి ఇంట ఉండటం ఎంత ప్రమాదం! ఊళ్ళో వాళ్ళంతా, "ఆ దయ్యం ముండను వెళ్ళగొడతావా, లేక నువే ఊరు విడిచి పోతావా?" అని అతన్ని అడుగుతున్నారు. మల్లయ్య ఇంటి చుట్టూ అస్తమానం జనం మూగుతున్నారు.

ఒకనాడు మల్లయ్య కుటుంబమంతా ఆవరణలో ఉండగా ఒక పిల్లి ఒక ఎలుకను తరుముకుంటూ వచ్చింది. ఎలుక పరిగెత్తుకుంటూ వెళ్ళి ఒక సన్నటి కలుగులో దూరింది.

ఇదంతా చూస్తున్న మల్లయ్య కొడుకు, పసివాడు, "దయ్యమ్మా, దయ్యమ్మా! ఆ ఎలుకను తీసుకురా!" అని అడిగాడు ఎంతో ఉత్సాహంగా.

"ఏం? నాకు చాతకాదనుకున్నావా?" అంటూ దయ్యమ్మ అందరూ చూస్తుండగానే ఎలుకంత చిన్నదైపోయి కలుగులోకి దూరింది. ఇదే సమయమనుకుని మల్లయ్య గంపెడు మట్టి తెచ్చి ఆ కలుగును పూడ్చేసాడు. అంతే, ఆ తరవాత దయ్యమ్మను ఎవరూ చూడలేదు.






అమెరికాలోని అరిజోనాలో వున్న 'గ్రాండ్ కానియన్' కనుమలే ప్రపంచంలోకెల్లా పెద్ద కనుమలు. 4 నుంచి 13 మైళ్ళ వెడల్పుతో 217 మైళ్ళు వ్యాపించి వున్న ఈ కనుమల లోతు 7,000 అడుగులు. 225 మిలియన్ సంవత్సరాల క్రితం కొలొరాడోనదీ ప్రవాహంవల్ల ఈ కనుమలు ఏర్పడ్డాయి. వాతావరణ మార్పుల కారణంగా ఈ కనుమలకు వింత ఆకారాలు ఏర్పడ్డాయి.

సహారా ఎడారి లోతు (ఇసుకమందం) కొన్ని అంగుళాలతో ప్రారంభమై దాదాపు 400 అడుగులవరకు వుంది.






### కనిపించే రక్తం

అంటార్కిటికా మంచుచేపల రక్తం స్పష్టంగా కనిపిస్తూ వుంటుంది. రక్తంవున్న ప్రాణులలో, తొంభై శాతం ప్రాణవాయువును శరీరభాగాలకు సరఫరాచేసే ఎర్ర రంగు హెమోగ్లోబిన్ ఈ చేపల రక్తంలో లేదు.



### ఏనుగు కునుకు

ఏనుగులు ఒక రోజుకు రెండు గంటలసేపు మాత్రమే నిద్ర పోతాయి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



P. S. Rajagopal



A. V. Rangaiah

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఒకరికొకరు అండగా! రెండవ ఫోటో: విరబూస్తాం నిండుగా!!

పంపినవారు: సి. మీనామదన్, వి. ఎల్. పురం, బాపట్ల—522 101

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

కొత్త సెరిలాక్ ఆరంజ్




# మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం

మీ పాపాయికి మరొక లాభాన్ని అందజేసేందుకు యిదిగో కొత్త సెరిలాక్ ఆరంజ్. మీ పాపాయి కొత్త రుచులను అలవరుచుకున్నప్పుడు. అతని ఆహారంలో మరింత వైవిధ్యం తెచ్చే లాభం. దీనితోబాటు నారింజ మంచితనం కూడా లభిస్తుంది.

మీరు మీ పాపాయికి సెరిలాక్ ఆరంజ్ యిస్తున్నారంటే. అతనికి సెరిలాక్ లాభాలన్నింటినీ యిస్తూనే ఉన్నారన్న మాట–ప్రతి సారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి, చక్కటి రుచి. క్షణాలలో తయారు కావడం.

కాబట్టి. పాలు త్రాగించడంతోబాటు, 4 నెలల నుంచి అతనికి సెరిలాక్ వీట్. 6 నెలల నుంచి సెరిలాక్ ఆపిల్/క్రొత్త సెరిలాక్ ఆరంజ్ యివ్వండి–మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందజేసేందుకు రుచి కరమైన మూడు మార్గాలు.

పరిశుభ్రంగా తయారు చేయడానికి, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకూను. దయచేసి డబ్బా మీద ఉన్న సూచనలు జాగ్రత్తగా అనుసరించండి.






Nestlé

## ంచొచ్చు, నాకుతూ తినొచ్చు, చిలక్కొట్టి తినొచ్చు, అలాగే తినొచ్చు...






## ...లేదా గటగట త్రాగేయొచ్చు.

ఇదుగో ఇప్పుడు రస్న అందిస్తోంది సాఫ్ట్ డ్రింక్‌ని మించిన మజా! షాహీ గులాబ్, కూల్ ఖస్, కేసర్ ఇలైచి, మేంగో రైప్ అనే నాలుగు రస్న ప్రీమియమ్ రుచులు. వీటితో ఇక మీరు తయారు చేసుకోవచ్చు నురగలు పొంగే మిల్క్ షేక్‌లు, నోరూరించే ఐస్ క్రీమ్‌లు, లొట్టలు వేయించే లస్సీలు.... వేసవిలో రస్న లాగానే అద్భుతంగా దాహం తీర్చేవి.

నందించండి మరి రస్న ఇచ్చే ఈ నాలుగు విశిష్ట రుచులు! తృప్తి తీరా ఉల్లాసంగా త్రాగండి, త్రాగించండి.... తినండి, తినిపించండి.

రస్న ప్రీమియమ్ రుచులు

■ షాహీ గులాబ్ ■ కూల్ ఖస్
■ కేసర్ ఇలైచి ■ మేంగో రైప్

ఐ లవ్ యూ రస్న

# రస్న




భా ర త దే శ పు • అ త్య ధి కం గా • అ